# శివపూజా రహస్యాలు-I

## విషయాను క్రమణిక!





# ముందు మాట!

'**మహాశివరాత్రి**' మన హిందూపండగలలోకల్లా, కేవలం ఆధ్యాత్మిక కార్యక్రమంగల పండుగ అంటే మిగతా పండగలవలే పొట్టనిండా తినడానికి పిండివంటలు, కొత్తబట్టలు, వినోదాలతో నిండినది కాకుండా ఉపవాసం, జాగరణ, జపము వంటి సాధనాంశాలకోసం ఉద్దేశించబడిన పవిత్ర పర్వ దినం! ఐనప్పటికీ ఈనాడు మనలో చాలామంది ఈ పండుగనాడు ఏం చేయాలో తెలియక రాత్రి ఏ సినిమాకో సెకండ్‌షోకు వెళ్ళి 'జాగరణ' అనుకొని చెత్తగా కాలం వృధాచేసుకొని **శివరాత్రి** పుణ్యంవస్తుందని భ్రమించే వ్యర్థజీవులుగా తయారౌతున్నారు!

అలా కాకుండా 1) **శివతత్త్వం** అంటే ఏమిటి? 2) **శివోపాసన** ఎలా చేయాలి? 3) **శివపంచాక్షరీ రహస్యార్థమే**మిటి? 4) శివరాత్రినాడు చేయ వలసిన విధులూ, **శివుని వర్ణన**లోని యోగశాస్త్ర, **జ్యోతిష**శాస్త్ర **మంత్రశాస్త్ర** పరమైన **అంతరార్థాలు** ఏమిటి? — అన్న అంశాలు అనేకం నిజమైన సాధకులకోసం రాయబడిన ఈ అతి చిన్న పుస్తకంలో ఇమిడేలాగా వేదాలు పురాణాలసారం ఇవ్వబడింది! చెత్తపుస్తకాలకై సినిమా, TV, సెక్సుపత్రికలపై

వందలు, వేలు డబ్బులు తగలెయ్యకుండా, కాలాన్నీ, ధనాన్నీ, జీవితాన్ని సద్వినియోగం చేసుకొని సార్ధకం చేసుకొనేందుకు ఈ పుస్తకం మీకోసం — శివరాత్రి సందర్భంగా!

# II

అంతేకాక — ఈగ్రంథం రెండోభాగంలో **"మన్యుసూక్త" రహస్యాలూ,** (I) పాశుపత, (II) స్కంద, (III) హనుమత్, (IV) తాపసమన్యు — అనులోమ ప్రతిలోమ "పాదార్చల"తోపాటు తైలాభిషేకసహిత మనుసూక్త విద్యారహస్యములు కలిపి ఇప్పుడు వేదపండితులకోసం అచ్చువేసి అందిస్తున్నాను ఇంకనూ పాశుపతాస్త్రమంత్రము మనుసూక్తమునకు యంత్రోద్ధారమూకూడా యిస్తున్నాను శ్రద్ధతో అనుష్ఠించి ఇష్టసిద్ధిని పొందండి!!!

గ్రహించండి — అనుగ్రహాన్ని ఇది 'దైవానుగ్రహం' అని గ్రహించండి! తరించండి!

ఆశీస్సులతో

**"సాయి నిలయం"**
హైదరాబాద్
1-2-2002

ఇట్లు
మీ
**వేదవ్యాస**



1

# శివుడు

వేదాలలో లక్షలకోట్ల సంవత్సరాల క్రితమే ఈనాటి మన **హిందూ మతానికి** 'మూలం' (Roots) **సనాతనధర్మం** ప్రాచీన ఋషులచే భగవంతుని అనుగ్రహంగా దివ్యదృష్టితో దర్శించిన రహస్యాలను అందించారు!

అందులో మన **పండుగల** గురించిన విజ్ఞానం ముఖ్యమైనది! ఇదివరలో **"మన పండుగలు"** గ్రంథంలో తెలుపని నిగూఢ రహస్యాలు కొన్ని ఇప్పుడు మన **హిందూమతంలో డిగ్రీ** చదివే విద్యార్థులకు చెప్పిన పాఠాల సారం పాఠ్యగ్రంథంగా అందిస్తున్నాను

## త్రిమూర్తుల్లో – 'శివతత్త్వం' – రహస్యం

శివుడూ - విష్ణువూ - బ్రహ్మ అనే ముగ్గురు దేవతలూ త్రిమూర్తులని పేరు! ఇందులో శివుడు సంహారకుడు! అనగా సృష్టి స్థితి ప్రళయములలో ప్రళయకాలము — ఈ శివుని ఆకారంగా సామాన్యుడికి గోచరించకుండా నిగూఢంగా వర్ణించబడివున్నది! యోగదృష్టి కలిగినవారికి జ్యోతిష మంత్రశాస్త్ర

యోగశాస్త్ర రహస్యములు తెలిసినవారికి మాత్రమే వేదాలలోని ఈ సనాతన ధర్మంలోని నిగూఢ రహస్యాలు అర్థంకాగలవు! ఈ మూడూ తెలిసినవారు ఈనాటి సమాజంలో 'ఇంగ్లీషు చదువుల పుణ్యమా' అని లభించరు! అందు కని అమూల్యమైన ఈ శివరాత్రిలో ఆరాధింపబడే శివునిగూర్చిన ఆధ్యాత్మిక రహస్యాలు కొన్ని మీకు ఇక్కడ బహిరంగంగా తెలియజేస్తాను!

## 'పంచాక్షర – స్థితుడంటే'?

శివుడు పంచాక్షరీ మంత్రముద్వారా సాక్షాత్కరించేవాడు 'పంచ' అనగా అయిదు, 'అక్షరము' అనగా 'అ+**క్షరము**' లేక నాశనము లేనివి ఐన 'పంచభూతములు'!

పంచభూతములంటే భూమి, జలము, అగ్ని, వాయువూ, ఆకాశము ఈ ఐదింటి ఆధారంగానే మానవ శరీరం నిర్మాణంకాబడింది! దీనికి సూచనగా గుర్తుండేలాగ భగవంతుడే మనిషి చేతికి ఐదువేళ్ళు కుడిచేతికీ, ఎడమ చేతులకూ సహజంగానే ఏర్పరిచాడు! ఇది యాదృచ్ఛికమేమో అని, అనుకోకుండా రెండు పాదాలకూ కూడా చెరి అయిదువేళ్ళే!! ఇవి ఇలా ఏర్పాటు చేయబడివుండటం ఎందుకో ఎవరూ గమనించని ''సృష్టి రహస్యం''!!

## పంచతత్త్వాలు :

అలానే ఐదు **జ్ఞానేంద్రియాలు** ముఖములో ముక్కు, నోరు లేక నాలుక (రుచి), చెవి (శబ్దము), చర్మము (స్పర్శ) వంటి అయిదు (పంచ) ఇంద్రియాలద్వారా ఈ బాహ్యాసృష్టిని మనలోని **జీవాత్మ** తెలుసుకోగలుగు తున్నాడు! ఇవే, అయిదు లేక **పంచ తత్త్వములు**

అలానే ·కర్మేంద్రియాలు కూడా అయిదే! వాక్కు, పాణి (చేతులు),

పాదములు, పాయువు (మలద్వారం), ఉపస్థం (మూత్ర ద్వారం) వంటివి **'కర్మేంద్రియాలు'**గా చెప్పబడుతున్నాయి! అవే పంచాక్షరములకు వెనుకవున్న పంచ మహాసత్యాలు! ఈ పంచాక్షరములచేత తెలియచేయబడే తత్త్వమే **"శివతత్త్వం"**!

అయితే ఇంతకీ ఈ **'శివుడు'** అనగా, ఎవరూ దీనికి సమాధానం శాస్త్రలే తెలిపివున్నాయి ఊహాగానం అవసరం లేకుండా

**"దేహం దేవాలయం ప్రోక్తం**
**జీవో దేవ 'స్సనాతనః' "**

అంటే అర్ధం ఈ దేహమే దేవాలయం అని చెప్పబడివుంది! ఈ శరీరంలో వుండే ప్రాణస్వరూపుడైన జీవుడే — "శివుడు"! ఈ జీవరూపంలో వున్నది సనాతనుడైన భగవంతుని అంశమే కాబట్టి పంచభూతాలతో ఏర్పడిన శరీరంలో బంధింపబడివున్న "జీవుడే" **శివుడు!** ఇదే, శివతత్త్వం!! జీవుడిగా సాధన మొదలుపెట్టిన యోగి ఈ 5-తత్వాల వెనుక దాగివున్న పరతత్త్వాన్ని సాక్షాత్కరింపచేసుకొని 'శివయోగి'గా మారతాడు! అంటే 'శివుడే యోగి'!

## శివుని రూపం అంతరార్ధం :

మనకు క్యాలెండర్‌లలోనూ, పురాణగాధలలోనూ శివుడి రూపం విచిత్రంగా వర్ణించబడివుంది! ఇందులో ఏదీ విమర్శగా ఏ హిందువుకూ తెలియదు! శివునికి మూడునేత్రములు — అనగా జ్ఞాననేత్రమైన 'మూడవ కన్ను' శివుని ప్రత్యేకత! అనగా యోగికి ఈ **శివజ్ఞానం** లేక బ్రహ్మజ్ఞానం 'యోగసిద్ధి'గా కలిగినప్పుడే అతడు తాను జీవుడను అనే అజ్ఞానం వదిలి తానే శివుడను — **"శివోహం"** అన్న యదార్ధ విజ్ఞానం కలుగుతుంది

## "మూడవ-కన్ను" :

రెండుకళ్ళతో చూస్తే పదార్ధమయ ప్రపంచంగా భాసించే నీవు మూడవ జ్ఞాననేత్రంతొ చూస్తే సాక్షాత్తూ బగవంతుడిగా నీ విశ్వరూపమే! అని స్తోత్రం

చేస్తాడు।

అనగా ఈ విశ్వం భగవత్ స్వరూపంగా దర్శించే యోగస్థితియే 'శివజ్ఞానం'। అలా సిద్ధించిన యోగి ఏస్థితిలో వుంటాడో రహస్యపరిభాషలో వర్ణించి తెలిపేదే శివుడి రూపం। అంటే ఏమిటి? శివుడికి మూడవకన్ను బ్రహ్మజ్ఞానం, లేదా భగవంతుడిని చూసే దివ్యచక్షుస్సు! దీనివలన మనిషి లోని కామం, క్రోధం శాశ్వతంగా నశించాలి అని తెలిపేందుకే శివుడు మూడోకన్ను తెరచి మన్మధుడిని (కామం) భస్మం చేశాడని చెప్పబడింది శివపురాణంలో।

## నాగాభరణము :

అలానే శివుని మెడలో **పాముతో "నాగాభరణుడు"** అని చెప్పబడివుంది యోగపరిభాషలో **'కుండలినీ-శక్తి'యే** సర్పం। కోరికలు, స్వార్ధము, కామము, మమకారములను పూర్తిగా జయించినవారికి 'కుండలినీ శక్తి' మేల్కొని దాని ఫలితంగా అప్పుడు కలిగే యోగసిద్ధులే ఈ శివయోగికి ఆభరణాలైన సర్పాలు।

## ఈశ్వరత్వము :

యోగికి అష్టమహాసిద్ధులు కలుగుతాయని 'కుండలినీ యోగం'లో చెప్పబడివుంది। అందులో పతంజలిమహర్షి ఆఖరి సిద్ధిగా **"ఈశత్వం"** అంటే పంచభూతములకూ ఈశుడు అధిపతిగా కలిగేస్థితిని 'ఈశ్వరుడు' అంటాడు। ఇది శివుడి మెడలోని పాములకు గల సంకేతార్థం (Symbolic meaning)

అలాగే, యోగసిద్ధి ద్వారా ఆత్మసాక్షాత్కారం పొందినవానికి స్త్రీ, పురుష భేదం నశించిపోతుంది! దానికి గుర్తుగా శివుడు అర్ధనారీశ్వరుడని సంకేతంగా చెప్పబడింది।

యోగి శరీరంలో కరెంటువంటి, విద్యుత్తులా ప్రవహించే కుండలినీ శక్తి **ఇడానాడి** (+ పాజిటివ్) **పింగళానాడి** (– నెగిటివ్) లలో **'ధనవిద్యుత్తు'** **'ఋణవిద్యుత్తు'** అని సైన్సులో పిలిచే 'శక్తి' (Power) స్త్రీ, పురుష శక్తులుగా కుడి ఎడమల ప్రవహించడమే అర్ధనారీశ్వరుల వెనుక రహస్యం! ఇలా తన లోనే స్త్రీని, పురుషుని దర్శించగల యోగి కామవాంఛలు మన్మధునిలా భస్మం కావడంలో ఆశ్చర్యంలేదు!

అట్టివాడు మృత్యువును జయించగలడు! ఎవరు కామాన్ని (సెక్సును) జయిస్తారో వారే మృత్యువునూ జయించగలుగుతారు! ఈ రెంటినీ జయించినవాడే 'శివుడు' లేక 'శివయోగి'! ఇది శివుని మృత్యుంజయత్వానికి గల సంకేతార్ధం!!

## ఫాలంపై – చంద్రుడు!

అలానే శివునికి నుదుట అర్ధచంద్రుడు వున్నట్లుగా వర్ణించబడ్డాడు 'చంద్రుడెప్పటికీ' అర్ధచంద్రుడుగానే ఉండిపోడుకదా? ఏమిటి దీని అంత రార్ధం? అంటే యోగశాస్త్రం తెలియాలి! యోగి నుదుట ఆజ్ఞాచక్రం వెనుక కుడిఎడమలలో సూర్యనాడి, చంద్రనాడి ఉన్నాయి! అందులో ఎడమవైపు చంద్రనాడి సగభాగమే కాబట్టి నుదుటిలో అర్ధచంద్రభాగమే 'శివ-లక్షణం' అని అనినారు!

కుండలినీశక్తి ఆజ్ఞాచక్రం వరకూ ఎక్కిరాగానే అక్కడేవుండే **అమృత-నాడి** మేల్కొని అంగుటిలోంచి అమృతం స్రవిస్తుంది! ఫలితంగా యోగి అన్నపానాలు లేకుండా ముమ్మిడివరం బాలయోగి వలే జీవించి వుండగలుగు తాడు! ఇది నుదుటి చంద్రకళ స్రవించే అమృతంయొక్క రహస్యం!!

అలానే కుండలినీశక్తి సహస్రారం ఛేదించుకొని కపాలభేదనం అయిం తరువాత యోగికి స్వచ్ఛమైన పరమాత్మ జ్ఞానం చిచ్చుబుడ్డిలోని కాంతి ముత్యాలవలే వెదజల్లుతుంది!

## తలపై 'గంగ' :

అది 'కావ్యకంఠ గణపతి ముని' జీవితచరిత్ర చదివితే ఆయనకు రమణమహర్షి అనుగ్రహంతో కపాలభేదనం కావడం తద్వారా విద్యుత్తువంటి వెలుగుతో కరెంటువంటి శక్తి శిరస్సును ఛేదించుకొని కపాలభేదనం జరగటం యదార్ధంగా జరిగినాయి!

ఇలా జరిగిన యోగి నిజంగా శివస్వరూపుడే కనుక శివుని శిరస్సు నుండి గంగ ఎగసిపడుతూంటుంది ఈ గంగ హరిపాదోద్భవి! అనగా యోగికి సహస్రారం పైనవుండే నారాయణస్థానం అనబడే ముక్తలోకం దర్శనమిస్తుంది! అందునుండి పుట్టే యోగశక్తి ప్రవాహమే ఆయన భార్య — లోకపావనియైన **గంగ!** అందుకే శివుడు నిత్యమూ కాశీలో మరణించే వారి కుడిచెవిలో రామతారకమంత్రం ఉపదేశిస్తాడనీ, అది తాను స్వయంగా చూశాననీ శ్రీరామ కృష్ణులు తమ అనుభవాలలో చెబుతారు ఇది తెలియక శివకేశవుల భేదం గురించే మాట్లాడేవారు "పశువులు"!

## పశుపతి :

అనగా శివజ్ఞానంలేని ఆత్మజ్ఞానం యోగసిద్ధిలేని జీవుడే పశువు! ఇదిగా చెప్పబడిన మాటగా వేదంలో

"నమః పశూనాం పతిం"

అనగా — "పశువులకు అధిపతి అయిన రుద్రునికి నమస్సులు" అంటుంది వేదం! ఇక్కడ 'పశువు' అనగా శరీరంలోని కామక్రోధాలచేత బంధింపబడి, ఆకలికీ, నిద్రకూ, సెక్సుకూ, స్వార్ధానికీ బానిసగా జీవించే దశలో వున్న జీవులు! వారిని నడిపించేది శివుడట! అంటే అర్ధం, వారి శరీరంలోని పంచభూతాలు పంచేంద్రియాలతో బంధింపబడివున్న జీవుడే వారి స్వభావంలోని పశుత్వంద్వారా కంట్రోలు చేస్తున్నాడు బలాత్కారంగా

పశువులు బంధించినట్లు బంధిస్తున్నాడు అందుకని "పశుపతి"! అతడే శివ జ్ఞానం కలిగితే ఆ జీవుడే శివుడౌతాడు! అటువంటివారి శరీరమే దేవాలయం! ఇదే శివతత్త్వంలోని పరమార్థ రహస్యం!

## ఏకాదశ-రుద్రులు :

ఇకపోతే శివుడికి "ఏకాదశ అంటే పదకొండుగురు అని 'ఏకాదశ రుద్రులను' వర్ణిస్తుంది వేదం! ఇది కూడా యోగపరిభాషలోనే అర్థం చేసు కోవాలి! మనిషికి ఆత్మజ్ఞానం కలగాలంటే అది ఐదు కర్మేంద్రియాలద్వారా కలుగదు! ఐదు జ్ఞానేంద్రియాలద్వారా కూడా కలుగదు! మరి దేనివల్ల కలుగుతుంది? అంటే దశేంద్రియాలకూ అందని 11-వ ద్వారం **ఏకాదశ ద్వారం!** అది మన భ్రూమధ్యంనుండి సహస్రారంవైపు రంధ్రంగా తెరుచు కున్నప్పుడే 'కపాలభేదనం' చేసి మృత్యుంజయత్వం లభిస్తుంది! అట్టి 11వ ద్వారానికి సంకేతమే రుద్రుని **ఏకాదశ స్థానం!** అట్టి కపాలభేదనం చేసే యోగశక్తియే 'శివశక్తి' కనుకనే శివుడు **కపాలీశ్వరుడైనాడు**

## కపాలీశ్వరుడు :

కపాలంలోనే భిక్ష కూడా చేస్తాడట! ఎందుకని? పాత్రలేకనా? లేదని కాదు మన శిరస్సులో వుండే శివుడు మననుండి భిక్షించేది బియ్యమూ, తిండీకాదు! జపమూ, యోగసాధనా, వైరాగ్యమూ కావాలని ప్రతి జీవినుండీ భగవంతుడు కోరే భిక్ష! అది కోరే దైవమే 'ఆదిభిక్షుకు'డైన శివుడు! అట్టి శివుని సంతోషపరచాలంటే ఉపవాసంతో జాగరణతో మేల్కొలిపిన జ్ఞానమే "శివజ్ఞానము" (ఆత్మస్వరూప జ్ఞానమే) — అదే రాత్రిమధ్యలో వెలిగే **శివరాత్రి!!**

## లింగోద్భవం :

ఇదే సహస్రారంలో లింగొద్భవకాలంలో కర్పూర కళిక భగవత్ జ్యోతిగా వెలుగుతూ ఉంటుంది! ఇక్కడ లింగము అంటే తప్పుడుఅర్థం తీసుకొన రాదు! 'లింగ' మనగా మన పదార్థమయ స్థూలశరీరం లోపల దాగివుండే

**'లింగశరీరం'** (Astral Body). అది జ్యోతిరూపంలో వెలుగుతూ వుంటుందని వేదం

**"జ్వాలాయ నమః**
**జ్వల లింగాయ నమః**
**ఆత్మాయ నమః**
**ఆత్మ లింగాయ నమః**
**పరమాయ నమః**
**పరమ లింగాయ నమః"**

అని ఆత్మగా, జ్వాలగా, పరంజ్యోతిగా వెలిగే లింగమే 'ఆత్మజ్యోతి!' దానిని దర్శించేందుకు చేసే ప్రత్యేక సాధనయే శివరాత్రి వెనుకగల ఆధ్యాత్మిక రహస్యం!

## 'నంది' – స్వరూపం :

ఇలా భగవతత్త్వాన్ని జయించినవారికి ఈ పదార్థమూ (Matter) దానివల్ల ఏర్పడే స్థూలశరీరంయొక్క సోమరితనమూ పూర్తిగా వశమై వుంటుంది! అదియే నందీశ్వరుడు!

## ఆది-'మిథునం' :

ఆకాశంలో జ్యోతిషం ప్రకారం చూస్తే **వృషభరాశికి** ఎదురుగా **మిథున రాశిలో** ఆర్ద్రా నక్షత్రం వెలుగుతూ ఉంటుంది ఆర్ద్రానక్షత్రమే రుద్రనక్షత్రం! అది మిథునరాశిలో ఉన్నది! 'మిథునం' అనగా ఆడ-మగ కలిసిన 'జంటరాశి' వీరే **'శివ-పార్వతులు'** అనగా ఆది-మిథునం! ఈ రాశికి — ఎదురుగా 'వృషభరాశి' పండుకొని వుంటుంది నక్షత్ర మండలంలోని ఆ వృషభమే ధర్మ స్వరూపమై వున్నది! ఇది **జ్యోతిషశాస్త్ర** రహస్యం! ఇంకా ఎన్నో నిగూఢ రహస్యా లున్నాయి! కాని ఏమి తెలియని అజ్ఞానంలో వున్న సామాన్యులకు ఈమాత్ర మైనా శివరాత్రి రహస్యాలు అందించాలని మీముందుంచాను!

## శివమూర్తులు :

హిందూమతంలో ఆగమశాస్త్ర ప్రకారం ఏ దేవతామూర్తిని ప్రతిష్టించాలన్నా ఆ మూర్తి ఆకారం ఏవిధంగా ఉండాలో శాస్త్రాలలో వర్ణించబడివున్నది దేవతామూర్తులు ముఖ్యంగా త్రిమూర్తులూ, గణపతి, శక్తి ప్రధానమైనవిగా చెప్పవచ్చు! త్రిమూర్తులలో శివునికి అనేక రూపాలు చెప్పబడివున్నాయి!

## 1. ఏకాదశ రుద్రులు :

రుద్రునికి శైవాగమంప్రకారం 1) శంభుడు, 2) పినాకి, 3) గిరీశుడు, 4) స్థాణుడు, 5) భర్గుడు, 6) సదాశివుడు, 7) శివుడు, 8) హరుడు, 9) శర్వుడు, 10) కపాలి, 11) భవుడు అన్న మూర్తులు చెప్పబడివున్నాయి ఈ ఏకాదశరుద్రులుకాక శివునికి అష్టమూర్తులు, అనగా ఎనిమిది రూపాలూ చెప్పబడి వున్నాయి

## 2. శివుని అష్టమూర్తులు :

1) భవుడు, 2) శర్వుడు, 3) ఈశానుడు, 4) పశుపతి, 5) ఉగ్రుడు, 6) రుద్రుడు, 7) భీముడు, 8) మహాదేవుడు అన్నవే శివుని ఎనిమిది మూర్తులు! శివుని అష్టమూర్తులు నాలుగు చేతులు కలిగివుండి మూడవ కంటితో జటాజూటముతో ఎఱ్ఱని వస్త్రముతో భూషణములతొ వర్ణించబడి వున్న అష్టమూర్తులందరూ అభయ ముద్రను టంకమును కుడివైపున ధరించి, ఎడమచేతులలో వరదముద్రను, లేడిని ధరించివుంటారు ఈ అష్టమూర్తులలో **భవుడు** తెలుపువర్ణము, **శర్వుడు** నలుపు, **ఈశానుడు** ఎఱుపు, **పశుపతి** నల్లనివర్ణము, **ఉగ్రుడు** పసుపు కలిసిన తెలుపు, **రుద్రుడు** కుంకుమ వర్ణం ఎరుపు, **భీముడు** ప్రవాళ (పగడమువంటి) ఎరుపు, **మహాదేవుడు** నలుపు వర్ణముతొనూ, వర్ణింపబడి ఉన్నారు

"శుక్లఃశ్యామశ్చ రక్తశ్చ కృష్ణో గోక్షీర సన్నిభః
కేసరో విద్రుమౌ నీలో భవాదీనాం చ వర్ణకా!"

ఇవేగాక శివునియొక్క ముఖ్యమైన మూర్తులు ఇంకా ఈక్రింద తెలుపబడివున్నాయి

## చంద్రశేఖరుడు :

పగడము వంటి ఎఱ్ఱని శరీరకాంతి కలిగినవాడు మృదుమధురమైన ప్రేమభావమును వ్యక్తముచేయు ఆకృతికలిగి, విశాలమైన నుదురు, త్రినేత్రములతో, శిరస్సున అర్ధచంద్రునితో పాద పీఠముపై నిలిచి నాలుగు బాహువులు కలిగి కుడిచేతిలో ఒకటి అభయముద్ర రెండవదానిలో పరశువు ధరించి ఉంటాడు

ఎడమచేతిలో ఒకచేత వరదముద్ర, మరోచేత లేడిని ధరించిన చతుర్భుజమూర్తిగా ధ్యానించాలి!



"అభయ వరదహస్తం సౌమ్య శృంగార భావం"
విపుల వదన నేత్రం చంద్ర బింబాంశ మౌళిం!
ఋజుతను సమపాదస్థానకం విద్రుమాభం
హరిణ పశుపాణిం పద్మ పీఠస్థమీడే!!!

## ఉమామహేశ్వరుడు :



**ఉమ** అనగా పార్వతీదేవి! ఉమతో కూడిన ఈ **ఉమామహేశ్వరుడు** తెల్ల తామరపుష్పము వంటి ఉమాదేవిసహితుడై కూర్చుండి నల్లకలువల వంటి కన్నులతో ప్రసన్న ముఖము కలిగి చతుర్భుజములతో కుడిచేతులలో అభయముద్ర, టంకము ధరించి, ఎడమచేతులతో వరదముద్ర, లేడిని ధరించిన ప్రశాంతముఖుడైన, మూర్తిగ పరమాత్ముడైన ఉమామహేశుని ధ్యానించవలెను

## వృషభారూఢ శివుడు :



ఈ మూర్తిని శివుడు వృషభవాహనముపై కూర్చుండి ఎడమవైపున పార్వతీదేవిని పట్టుకొనివుండి కుడిచేత కటకముద్రతో, కుడితొడపై కూర్చుని వున్న వినాయకుని కౌగిలించుకొని ఒకచేత జపమాలను, వరదహస్తమునూ, లేడినీ ధరించిన తెల్లని కాంతిగల వృషభవాహనుడిగా శివుని ధ్యానించవలెను

**నటరాజమూర్తి :**



గుండ్రని అగ్నిజ్వాలామండలములో తాండవము చేయు నటరాజ మూర్తి తన ఒకచేత పాముయొక్క శిరస్సును పట్టుకొని, ఎడమపాదము పైకెత్తి కుడిపాదముతో అపస్మార పురుషని అణగత్రొక్కుచూ ఎఱ్ఱని పాదములూ, హస్తములూ కలిగి 4 చేతులు కలిగి కుడిచేతులలో ఢమరుకము, అభయ ముద్రలనూ, ఎడమవైపున ఢోలాహస్తము, అగ్నిని ధరించినవిధంగా **నటరాజ మూర్తిని** ధ్యానించవలెను

## అర్ధనారీశ్వరమూర్తి :



**కుడివైపున శంకరుని** మూర్తి ఎడమవైపున పార్వతి ఈశ్వరుడు ఎఱ్ఱని శరీరఛాయ కలిగి, గంగాదేవి చంద్రరేఖ గల జటాజూటముతో అర్ధపాల నేత్రముతో కపాలకుండలముతో పులితోలు వస్త్రములుగాగల సగముభాగము నడుముతో ప్రకాశించుచుండును ఎడమభాగములో **పార్వతీదేవి** నల్లటి శరీరఛాయ పాపట, తిలకములతో చెవినత్తులు ధరించి ఏకస్థనముతో నాల్గు చేతులు కలిగివుండును వీరహస్తమునందు టంకమునూ, పార్వతి హస్తము నడుముననుంచుకొని వరదహస్తము, కలువపువ్వూ ధరించివుండును

కుడిపాదము ఈశ్వరభాగము వంచబడి ఎడమపాదము అందెలతో అలంకరించబడిన అర్ధనారీశ్వరమూర్తిని — ఈ రెండువర్ణములలో ధ్యానించ వలెను

## దక్షిణామూర్తి :

వటవృక్షము క్రింద సుఖాసీనుడైన మహేశ్వరుడు, తెల్లని సర్వావయ వములతో, శిరస్సున అర్ధచంద్రునితో, నాగభూషణములతో పులితోలును వస్త్రముగా ధరించి సమస్త ముని గణములచేత సేవించబడుచూ ఆరాధ్య మూర్తియై ఉపదేశముద్ర ధరించి, సురాసురులు, కిన్నెర, కింపురుష ప్రమథులచే సేవింపబడుచున్న జ్ఞానఉపదేశమూర్తిగా ధ్యానించవలెను



కుడిచేత ధ్యానముద్ర, జపమాలలను ధరించి ఎడమచేతులలో పుస్తకమును, వీణను ధరించివుండును కుడివైపు జమదగ్ని, వశిష్టుడూ, భృగువు, నారదుడు నిలువబడియుండగా ఎడమభాగములో అపస్మార పురుషుని పాదములతో త్రొక్కును సకల లోకములను బ్రహ్మ జ్ఞానోపదేశము చేయువానిగా దక్షిణామూర్తిని ధ్యానించవలెను

## వీరభద్రమూర్తి :

నల్లని శరీరకాంతితో ఎఱ్ఱని వస్త్రములతో కనుబొమ్మలు ముడిపడి కోపించిన క్రోధములో అగ్నివలే మండుచున్న కేశములు కలిగి, మూడు కన్నులతో సింహచర్మము ధరించి ఎనిమిది చేతులతో ప్రకాశించును



కుడివైపు బాహువులలో దండము, శూలము, గొడ్డలిని ధరించి, ఎడమ భాగమున 1) ఖేటము, 2) కపాలము, 3) టంకము, 4) రోకలిని ధరించి, చిరుగంటతో, దండతో అలంకరించబడిన వీరభద్రమూర్తిని ధ్యానమూర్తిగా ధ్యానించవలెను

## మహాకైలాసమూర్తి :

ఈ మహాకైలాసమూర్తిని స్కాందపురాణంలోని శంకరసంహిత ఇలా వర్ణిస్తున్నది మేరుపర్వతానికి ఉత్తరభాగమున ఉన్న కైలాసగిరిపై ఎడమ భాగమున సర్వమంగళాదేవితో కూడిన చంద్రశేఖరుడైన పరమశివుడు భక్తులతో ప్రమధ గణములతో పరివేష్ఠితుడై ఉండును

గొప్పదైన సింహాసనముపై శ్రీమన్మహా పరమశివుడు చక్కగా వికసించిన కమలములవంటి ఇరువది అయిదు (25) ముఖములతో. వివిధాయుధములను ధరించిన ఏబది (50) చేతులతో, ఎఱ్ఱతామరపూవుల వంటి హస్తములతో, పాదములతో వివిధములైన మణులు పొదిగిన బంగారు నగలతో

భూషితుడై, కోటిసూర్యుల కాంతులను వెక్కిరించు ఆనందదాయకమైన రూపములో గంగా జటాజూటముతో, నెలవంక శిరోభూషణముతో, విభూతిని పూనుకొన్న సర్వాంగములతో, నాగయజ్ఞోపవీతుడై కపాలమాలను ధరించి, పులితోలును వస్త్రముగా ధరించి, ప్రతిముఖమునందు మూడుకన్నులతో కుడికాలును చాపి ఎడమకాలిని కుంచించి, భక్తుల కోరికలను అనుగ్ర హించుచూ అధివసించును!



1) అభయ ముద్ర, 2) చక్రము, 3) శూలము, 4) టంకము, 5) బాణము, 6) గద, 7) పద్మము, 8) ఖడ్గము, 9) తామరము, 10) శక్తి, 11) గొడ్డలి, 12) ప్రాసము, 13) నాగము, 14) నాగలి, 15) అంకుశము, 16) జపమాల, 17) చిన్నకత్తి, 18) ధ్వజము, 19) దండము, 20) వజ్రము, 21) కుంతము, 22) ఎముక, 23) దంష్ట్రము, 24) అంపము, 25) ఖిండినాలము కుడిచేతు లలో ధరించియుండి,

1) వరముద్ర, 2) విల్లు, 3) లేడి, 4) శంఖము, 5) ఖేటము, 6) పాశము, 7) గొడ్డలి, 8) ముద్గరము, 9) ఢమరుకము, 10) గంట,

11) రుద్రవీణ, 12) పునకము, 13) కపాలము, 14) పుత్తై, 15) ఖట్వాంగము, 16) భుశుండీ ఎడమ చేతులలో ధరించును

## మృత్యుంజయ మూర్తి :



అమృత మృత్యుంజయమూర్తిగా శివుడు తెల్లని శరీరఛాయ కలిగి శిరస్సున అమృతము స్రవించే అర్ధచంద్రునితో యోగసమాధిలో బంధింపబడిన పెదవులు, రెండుచేతులలో అమృతము నింపిన బంగారు కలశములు పట్టుకొని, మరిరెండు చేతులతో అమృతమును శిరస్సుపై అభిషేకించు కొనుచూ, పసుపురంగుగల జటలతో శిరస్సున చంద్రుడు, సూర్య, చంద్ర, అగ్నులూ, త్రినేత్రములతో నాగభూషణుడై సర్పయజ్ఞోపవీతమును ధరించి పులితోలు వస్త్రముగా ధరించి, భస్మము ధరించిన సర్వాంగములు కలిగి, కూర్చున్నవానిగా ధ్యానించవలెను



## 2

# శివతత్త్వ రహస్యము

హిందువుల పండుగలలో మహాపర్వదినములుగా భావించబడే విశేష పుణ్యదినముల్లలో **"మహాశివరాత్రి"** ప్రాముఖ్యమైనది మాఘ బహుళ చతుర్దశినాటి అర్ధరాత్రినుంచీ ఏర్పడే మహాపర్వ కాలమే సృష్టికి మహాప్రళయ సూచకమగు ఈ **మహాశివరాత్రి**

## త్రిమూర్తులలో – శివుడు :

సృష్టి, స్థితి, సంహారములు చేసే త్రిమూర్తులలో సృష్టి చేసేది బ్రహ్మ, స్థితికి రక్షకుడు విష్ణుభగవానుడూ అయినట్లే ప్రపంచానికి ప్రళయంచేసేవాడు మహాశివుడు।

అంటే — ప్రపంచంలో ప్రతిదానిని నశింపచేసేది **కాలమే** అందుకనే మహాశివుడిని మహాకాలుడని, కాలకాలుడని, రుద్రుడని, శివుడని, మృత్యుంజయుడని అనేక పేర్లతో పిలుస్తాము శాస్త్రాలలో శివభగవానుని ఈ పేర్లను చూస్తే పంచభూతాలపైనా పూర్తి కంట్రోలు అనగా తన వశమునందుంచు

కొనువాడూ, ప్రళయ సమయంలో వేటికవి విడగొట్టే "అణుధార్మికశక్తి" వంటి సంహారశక్తియే రుద్రుడు — లేక శివుడు!

## జీవుడిలో – "శివుడు" :

అందుకని యోగి శరీరంలో మేల్కొన్న **కుండలినీ** శక్తియే ఈ **సర్పము!** ఇంద్రియములపై విజయాన్ని సాధించే యోగి కామాన్ని నశింపచేస్తాడుగనుక శివుడు మన్మధుడిని భస్మం-చేసినట్లు చెప్పటానికి కారణమైంది అలానే భ్రూమధ్యములో వెలిగే జ్యోతియే **లలాట చంద్రకళ!** యోగస్థితివల్ల ఏర్పడే కామజయంవల్ల స్త్రీ, పురుష భేదము నశించి ఏకత్వస్థితిని పొందిన యోగియే — **అర్ధనారీశ్వరుడు.**

## అర్ధనారీశ్వరుడు :

యోగి శరీరంలో ఎడమవైపు కుడివైపూ కరెంటు తీగలవలె ఋణ-విద్యుత్తు, ధనవిద్యుత్తు (నెగెటివ్ కరెంటు, పాజిటివ్ కరెంటు) అనే శివ శక్త్యాత్మకమైన 'అర్ధనారీశ్వర-తత్త్వమే' ఈ శివపార్వతీతత్త్వము! అందుకే సెక్స్‌ను జయించటంద్వారా ముసలితనాన్ని, మృత్యువును అరికట్టిన శివుడికే మృత్యుంజయుడని పేరు కలిగింది!

బయట కనపడే ఈ ప్రపంచాన్ని జయించే ఇట్టి **యోగసిద్ధిని** పొందటానికి మనము చేయవలసిన సాధనయే **శివరాత్రి** నియమాలైన 1) ఉపవాసం, 2) రాత్రి నిద్రను జయించిన జాగరణ నిరంతర జపం, 3) యోగనిష్ఠలో వుండటం, 4) అలానే నీళ్ళయందూ, 5) అగ్ని మధ్యము లోనూ కూర్చుని తపస్సుద్వారా పంచభూతాలను జయించగలిగిన యోగికే **"శివయోగి"** అనిపేరు!

అట్టి వానిలో త్రిగుణములైన సత్త్వ, రజ, తమస్సులనే మూడు

గుణములయందూ భేదత్వము నశించి ఏకత్త్వమును పొందుతాడు కనుక — అదే ఆ సిద్ధియే **త్రిశూలం!**

## ఆర్ద్రాదర్శనం :

ఆర్ద్రానక్షత్రం ఆకాశంలో వెలుగుతున్నపుడే శివుడు దర్శనం ఇస్తాడు ఆర్ద్ర మిధునంలోవుంది అందువల్ల **"ఆది-మిధున"** మైన శివపార్వతులే ఈ **మిధునరాశి!** ఈ మిధునరాశిని సమీపించడానికి ముందుగా **వృషభరాశిని** దాటివెళ్ళాలి — ఆ వృషభమే **నందీశ్వరుడు!**

అలానే దేవతలలో రుద్రునికి ఏకాదశ 11 రూపములు చెప్పబడినవి మనలోని 5-జ్ఞానేంద్రియాలూ, 5-కర్మేంద్రియాలూ + 1-మనస్సూ కలిసి 5 + 5 + 1 = 11 ఏకాదశరుద్రకళ! వీరినే **ఏకాదశ-రుద్రులు** అంటారు అందులో **శంకరుడు** ముఖ్యుడు, **ఉమామహేశ్వరుడు** నిత్యప్రసన్నుడు, **నీల కంఠుడు,** యోగసిద్ధితో విషమును జయించిన నిత్యానంద స్వరూపుడు త్రిగుణములను భస్మంచేసినవాడే త్రిపురాంతకుడు! యోగంతో మేల్కొన్న జ్ఞాననేత్రమే మూడవకన్ను సమాధిస్థితిలో ప్రసన్నంగా ధ్యానిస్తుంటే నిరంతరంగా ప్రవహించే శివ-జ్ఞానం పవిత్రతయే శివజటాజూటంలోని గంగ లోకపావని

## పంచముఖుడు – అష్టమూర్తి :

ఈవిధంగా పరమశివుని పవిత్రరూపానికి అనేకమైన దివ్యార్థాలు వేదాలలో ఋషులు దర్శించి మనకి అందించారు

ప్రకృతిలోని పంచభూతాలే శివుని **"పంచముఖాలు"** అవి మన శరీరం లోని శివుని పంచేంద్రియాల్నీ తద్వారా అనుభవించే పంచతన్మాత్రలే పంచాక్షరీ మంత్రములోని పంచ (5) అక్షర = **అ** + క్షర = నాశనంలేని శివశక్తి!

అలానే పంచభూతాలకు పైనవుండే అహంకారము, మనస్సు, ఆత్మకూడా కలిపితే అవే శివుని — అష్టమూర్తులుగా చెప్పబడినవి!

తూర్పు, పడమర వంటి — **ఎనిమిది** దిక్కులు చిదాకాశ స్వరూపమే శివునికిగల బైటివిశ్వంలోని అష్టముఖములుగల "**అష్టమూర్తి**" యొక్క ఎనిమిది రూపములు! ఇందులో శివుని అఘోర, వామదేవ, సద్యోజాత, ఉగ్ర, భీమ, త్ర్యంబిక, కృష్ణపింగళ మొదలైన శివుని ఎనిమిది రూపాలూ విష్ణుదేవుని అష్టమూర్తులనబడే అష్టవిధ ప్రకృతిపై వెలిగే ప్రకృతిలోని — శాంత, ఘోర రూపములు ఇదే శివప్రకృతుల ఏకత్వరహస్యం అలానే శివునికి నివాసములుగా వర్ణించిన అతి చల్లని మంచుకొండయే కైలాసము! వెండికొండగా వెలిగేది శివజ్యోతి!

ఇంకా పన్నెండు పవిత్ర క్షేత్రాలైన శివక్షేత్రాలే ద్వాదశ జ్యోతిర్లింగాల రూపంలో శివుని నివాసములుగా చెప్పబడినవి ఈ పన్నెండూ కాలపురుషుని పన్నెండు రూపాలయిన **రాశిచక్రం**లోని 12-రాసులకు ప్రతిరూపాలు కాలుడే గదా? శివుడు!

## యోగ-ఆయుర్వేద శాస్త్రాలలో - "రుద్రగ్రంధి" :

మన శరీరంలోకూడా సమస్త దేవతలూ వున్నట్లే శివపరమాత్మునికి కూడా మనలో ప్రాణమునకు, మృత్యువునకూ కేంద్రమైన హృదయానికే "**రుద్రగ్రంధి**" అనిపేరు.

మెదడులో చిన్నమెదడు (Hind-brain) అన్నభాగం శరీరంలోకి వేడి నిచ్చి, జీవించిఉండేలాగా నిలుపుతుంది — కావున శివునికి జ్వరకారకుడు, జ్వరహరుడని పేరు

ఇలా వైద్యశాస్త్రంలో **వైద్యనాధుడని**, యోగశాస్త్రంలో **యోగనాధుడని** పవిత్రమైన అమరనాధంలో భ్రూమధ్యక్షేత్రములోని జ్యోతిర్లింగాకారములో వెలిగేది **అమరనాధుడుగాను** వర్ణించబడివున్నదీ ఆత్మజ్యోతియే!

## మన్యు-రుద్రమూర్తి :

అదేవిధంగా రుద్రునికి క్రోధరూపము ముఖ్య **మన్యుదేవతా** స్వరూపము. యుద్ధకారకుడైన, ప్రళయకారకుడైన **పాశుపత** రూపము (పాశుపతాస్త్రం) స్మశాన వాటికలో **కాపాలిక**రూపము, హరయోగిగా **లకులీశ** రూపము

ఇంకా శివుని **భిక్షాటనమూర్తి**గానూ, **ఆనందతాండవ** స్వరూపియగు నటరాజుగాను వర్ణించబడినాడు మోక్షసిద్ధి కారకునిగా పరమానందస్వరూపము ఆకాశరూపంలో **చిదంబరునిగా, చిత్** అనగా **మనస్సు**, అంబరం అనగా **ఆకాశం** లేక బట్ట అదే శరీరంగాగల ఈ విశాలవిశ్వంలోని **రోదసియే** రుద్రమూర్తి అందువలననే **రోదనకు** ప్రతిమూర్తిగా రుద్రుడనబడినాడు **'రుర్'** అనగా దుఃఖములే **రోదన** చేయుట శివుడు అవతరించగానే గట్టిగా రోదన చేయుటచేత **రుద్రుడనబడి నాడు** అని వేదంలో తెలుపబడింది

## రోదన-రుద్రుడు :

అంటే ఆత్మస్వరూపుడు, ప్రాణస్వరూపుడగు జీవుడుగా పుట్టగానే రోదన అంటే ఏడ్చుట అలా ఏడిస్తేనే బిడ్డ జీవించివున్నట్లు అందుచేత రుద్రుడు రోదనచేత మృత్యువును జయిస్తాడు అందుకే **రుర్** = దుఃఖము, **తదాది** అంటే ఇచ్చుట పూర్తి బ్రహ్మజ్ఞానం కలిగాక అయితే — **రుర్** = దుఃఖము, **ద్రావయతి** = **పోగొట్టి** నిత్యానందం కలిగించేవాడుకాబట్టి — **రుద్రుడు** అనబడినాడు

రుద్రుడు, శంకరుడు నీలలోహితుడు, కాలకంఠుడు, త్రయంబకుడు, త్రిపురాంతకుడు, మృత్యుంజయుడని, మార్కండేయుని వంటి భక్తుల రక్షణకై చూపిన **శివలీలలలో** అనేక పేర్లతో శివుడు చెప్పబడినాడు।

## విగ్రహంలేదు :

శివునికి మూర్తిలేదు — అనగా విగ్రహంలేదు శివలింగాకారమైన ఆకారం అంటే ఆత్మలో వెలిగే జ్యోతిర్లింగాకారం। సిద్ధి కలిగాక నిర్మల మనసు

రూపంలో ఉండే నిర్మలతయే **స్ఫటికలింగము**. అలానే బిల్వదళం, రుద్రాక్ష, భస్మవిభూతి, అభిషేక జలం ఇవన్నీ కూడ శివునికి ప్రీతిపాత్రములే

## కపాలి – ఆదిభిక్షువు :

శివుడు మృత్యుస్వరూపి! ఊరి బయటి స్మశానమే **రుద్రభూమి** అనబడును అనగా ప్రతివారూ అవసాన సమయంలో చేరుకోవలసిన స్థానమే రుద్రుని శాశ్వతస్థానం మన శిరస్సులో ఉండే మెదడు మనలో జ్ఞానం కలిగించే రుద్రుడే కాబట్టి! **కపాలంలో** ఉండేవాడు కాబట్టి **కపాలి** అనేపేరు అలానే మెదడులోంచి నరములరూపంలో మెడక్రిందివరకూ వ్యాపించిఉండే నాడులనే **రుద్రజడలు** అంటారు

## కాల-కాలుడు :

శివుడు కాలస్వరూపికూడా శివుడు "భగుడు" (యోని) 'లింగుడు' అనగా సృష్టికూడ భగవంతుని స్వరూపమే — అనగా కామము విజృంభించి సృష్టికార్యము జరుగు సమయంలో పురుషాకారములో లింగము ఊర్ధ్వ ముఖముగా నుండును కాబట్టి శివుడు **ఊర్ధ్వలింగుడు!** అగ్ని స్వరూపుడుగాన జ్యోతిర్లింగం, ఆత్మస్వరూపముగాన ఆత్మలింగస్వరూపుడనీ "**పరమ-లింగమూర్తి**" అయిన శివుడుగానూ అనేక పేర్లతో పిలుస్తారు

## దేహమే – దేవాలయం :

వీటిలో మన శరీరం, గుడియే జీవాత్మ, సూత్రాత్మ, లింగశరీరం ప్రత్యాగాత్మ వంటి మనలోని వివిధ అనేకములైన భాగములనే శివుని అనేక రూపాలుగా పేరుపెట్టబడినవి ఎందుకనగా ఈ శరీరమే లేదా **దేహమే** "దేవాలయము" అందులో జీవించే **జీవుడు** శివపరమాత్మయే!!! ఇది తెలిసి విశ్వాత్మ-భావంతో సాధన చేసేవాడే శివరూపియగు శివుడు ఇదియే శివతత్త్వ రహస్యము శివరాత్రి రహస్యం ఇదే — వేదవ్యాసమహర్షి తన "అష్టాదశ-

పురాణాల``లోని '**శివపురాణం**', '**లింగపురాణం**', "**స్కాందపురాణం**", దేవీభాగ వతంలో తెలిపిన పరమార్థోపదేశము!!!

ఈ **శివరాత్రి** మహాపర్వ సమయంలో అతిపవిత్రము, నిగూఢము గంభీరమూయైన ఈ ఆత్మజ్ఞాన స్వరూపమైన శివభగవానుని రూపాన్ని స్మరించి ముక్తిని పొందుదుముగాక — అదియే ఈ **మహాశివరాత్రికి** సార్థకృత

## మనరాష్ట్రంలోని ప్రసిద్ధ శివక్షేత్రములు

1) శ్రీశైలం — మల్లిఖార్జునుడు — కర్నూలు జిల్లా

2) **దాక్షారామం** — **భీమేశ్వరుడు** — **తూర్పు గోదావరి జిల్లా**

3) **పాలకొల్లు** — **క్షీరారామం** — **పశ్చిమ గోదావరి జిల్లా**

4) **అమరావతి** — **అమరేశ్వరుడు** — **గుంటూరు జిల్లా**

5) **కోటిపల్లి** — **కోటిఫలమునిచ్చును** — **తూర్పు గోదావరి జిల్లా**
(కోటి ఫలి)

6) **పిఠాపురం** — **కుక్కుటేశ్వరుడు** — **తూర్పు గోదావరి జిల్లా**
(దీనినే "పీఠికాపురి" లేక పీఠ-పురం అంటారు)

7) **మహానంది** — **నందీశ్వర ఆలయం** — **కర్నూలు జిల్లా**

8) **కాళేశ్వరం** — **కాళేశ్వరస్వామి** — **కరీంనగర్ జిల్లా**
(కాళం = సర్పము)

9) **శ్రీకాళహస్తి** — **శ్రీకాళహస్తీశ్వరుడు** — **చిత్తూరు జిల్లా**

10) **త్రిపురాంతకం** — **త్రిపురాంతక-మహాకాళుడు** — **గుంటూరు జిల్లా**



## 3

# శివాభరణములు - ఆయుధములు

మహాదేవుడైన శివునకు **మంత్రశాస్త్రము, తంత్రశాస్త్రము**, శిల్పశాస్త్రము **లలో** ఆభరణములు ఆయుధములు పరివారదేవతలూ వర్ణించబడినవి। అవి కేవలం ఆభరణములే కాదు, వాటికి వెనుక ఎంతో గూడార్థము ఆధ్యాత్మిక సత్యాలను దాచివుంచారు వేదకాలమునాటి ఋషీశ్వరులు। అందులో కొన్నిటిని గురించి ఇక్కడ తెలుసుకుందాం।

## 1) త్రిశూలం :

శివునికి త్రిశూలం అతిప్రాముఖ్యమైన ఆయుధము। విష్ణువునకు చక్రాయుధము, గణపతికి పాశాంకుశములవలెనే శివునకు త్రిశూలము ముఖ్యాయుధము।

త్రిశూలమనగా పైన మూడు కొసలతో మొనదేలి అగ్నిజ్వాలల రూపంలోవుండే మూడూ అడుగున కలిసి ఒకే శూలహస్తంగా వుంటాయి।

దీనికి అర్థమేమంటే శివుడు ఆత్మస్వరూపుడు। ఆత్మ త్రిగుణాలకు అతీత మైనది। త్రిగుణాలనగా సత్వము, రాజస, తమస్సు అన్న మూడుగుణాల ఏకత్వమే — త్రిగుణాతీతమైన శివతత్త్వము। ఇదే **త్రిశూలమునకు** సూచకము।

ఇంతేకాదు శివుడు మహాయోగి। యోగశాస్త్రంలో ప్రాణాయామంలో ఇడా, పింగళనాడులు అంటే కుడిఎడమ ముక్కులలోంచి అంగుట్లోంచి శ్వాస ప్రవహించి భ్రూమధ్యమైన శిరఃస్థానమునకు చేరుకుంటుంది। త్రికుటి అనబడే ఈ **మూడు నాడుల** బ్రహ్మజ్ఞానకేంద్రమే త్రివేణీసంగమం। — గంగా యమునా సరస్వతుల కూడలి। ఇదే త్రిశూలంతో — సూచ్యార్థము।



## 2. నాగాభరణము :

శివునకు మెడలో పాము, చేతులకు సర్పములు విధిగా శిల్పంలో చెక్కబడివుంటాయి। ఇక్కడ యోగశాస్త్రంలో కుండలినీశక్తి సర్పాకారంగా చెప్పబడినది। సాధనతో కుండలినీశక్తిని మేల్కొలిపి అణిమాది అష్టసిద్ధులను వశంలో వుంచుకున్న స్థితికి **ఈశత్వమని** పేరు। ఈశుడనగా ఈశ్వరుడు లేక శివుడు। ఈ సర్పాకారమగు కుండలినియే నాగాభరణం। ఇంతేకాక అష్టమహాసిద్ధులు షోడశసిద్ధులు అనేక శక్తులను సిద్ధింపచేయును! వీటిని సమగ్రంగా కంట్రోలుచేయలేనివాడికి పతనం లభించును। అందువల్ల యోగికి ఈ సిద్ధులు పాములవంటివి, ప్రమాదకారి। అట్టి సమస్త సిద్ధులనూ వశంలో వుంచుకున్నవాడు అని చెప్పుటకే పాములను ఆభరణములుగా రెండుచేతులకూ కంకణములుగానూ చెప్పబడినవి।

## 3. డమరుకం :

శివుని త్రిశూలమునకు కట్టిన డమరుకం అనబడే బుడబుక్కలవాని వాయిద్యంవంటిది చిత్రాల్లో చూపబడును। దీనికి రెండువేపులా చర్మం సాగదీసి కట్టుటవలన దానికి తాకిన బుడిపెలు శబ్దంచేయును। యోగ పరిభాషలో 'శబ్దగుణకం ఆకాశం' అనగా ఆకాశతత్త్వంయొక్క లక్షణం శబ్దము। అనగా వైబ్రేషన్ ఆకాశం (Space) నందు ప్రయాణించును। ఈ శబ్దాలు చెవిలోపల డ్రమ్ము సాగదీసిన చర్మంతో మైకువలే స్పందించును కనుక మంత్రం జపించినా విన్నా ఈ తరంగములు స్పందించుటవల్ల కలిగేదే **శివఢమరుకం ధ్వనింపచేయుట!** ఇవి శివతాండవమునకు సూచకం। అనగా మంత్రపురశ్చరణవల్ల **ఆనందం** కలిగి యోగి **ఆనందతాండవం** చేయుటకు ఈ ఢమరుకం "జప" సూచకం।

## త్రినేత్రము :

శివుడు ఫాలనేత్రుడు లేక త్రినేత్రుడు। అనగా నుదుట మూడవకన్ను కలవాడు। ఈ మూడవకన్ను జ్ఞాన దివ్యదృష్టి అతీంద్రియదృష్టికి సూచకము కనుబొమ్మలమధ్యనుండే ఆజ్ఞాచక్రం జ్ఞానకేంద్రం। అది తెలుసుకొనుటవలన భూత భవిష్యత్‌ను దర్శించే **కాలజ్ఞాన**సిద్ధికి సూచకమే ఈ మూడవ కన్ను! అట్టి జ్ఞానం సిద్ధించడానికి మనిషిలోని కామం, క్రోధం పూర్తిగా భస్మంచేయాలి! ఇదే మూడవకన్నుతో **మన్మధుని** భస్మంచేయుట!

ఈజిప్టులో ఫారో బొమ్మలపై నుదుట పాముబొమ్మ చెక్కివుంటుంది! కొన్ని జంతువులకు నడిమధ్య కన్ను (Median Eye) వుంటుంది! ఒకప్పుడు మానవజాతికి నుదుట మూడవకన్ను తెరచుకునివుండేది! శాపంవల్ల అది మూసుకుపోయింది ఈ జ్ఞాననేత్రం తెరుచుకుంటే కామాన్ని జయించగలుగు తారు! కాబట్టి మూడవకన్నుతో మన్మధుణ్ణి భస్మంచేశాడని చెప్తారు!

## స్మశానం :

శివుడి నివాసం స్మశానం అంటారు! సమస్తమైన **కోరికలూ** భస్మంచేసి కాలిపోయినచోటే స్మశానం! యోగసాధనచేసి యోగాగ్నివల్ల కోరికలు భస్మం చేసే ప్రదేశంకావడంతో జన్మలు, **కర్మలు** భస్మంచేయబడిన నిర్వాణస్థితే స్మశానం! అక్కడ పరమశాంతిగా వుంటుంది గనక శివస్థానం!

## విభూతి :

ఇక కోరికలన్నీ భస్మమైపోయాక చేరే జ్ఞానస్థితి తెల్లగావుంటుంది కనుక అది విభూది! ఆలోచనలు నశించడంవల్ల కలిగే శుద్ధమైన జ్ఞానానందం విభూది! అధిభౌతికం, మానసికం, ఆధ్యాత్మిక, అధిదైవికమని నాలుగు స్థాయిల్లో ఈ జ్ఞానపరిశుద్ధి కలిగితే ఆ విభూది నాలుగురేఖలుగా తెల్లగా వెలుగుతుంది! శరీరాన్ని పవిత్రం చేస్తుంది! ఇది భస్మంయొక్క రహస్యం!

## నందీశ్వరుడు :

రాశిచక్రంలో ఆది మిధునమైన ఆర్ద్రానక్షత్రం రుద్రస్థానం కాబట్టి మిధునరాశి శివపార్వతుల జంట — మిధునం (Gemeni)' మిధునరాశికి ముందుగా ఆకాశంలో రోహిణీ నక్షత్రమండలంతొ వృషభరాశి కనిపించును! ఆ వృషభమే నందీశ్వరుడు! వేదములో —

**"త్రిదాబద్ధో వృషభో రోరవీతి**
**మహోదేవో మర్త్యాన్ ఆవివేశ"**

## శ్రీకృష్ణుడు – శివోపాసన :

అని మూడులోకములలో త్రిధాపద్ధమైన **వృషభం** భగవంతుడైన మహా దేవుడు మానవరూపంలో అవతరిస్తున్నాడని గర్జిస్తున్నది అని ఈ మంత్రార్థం! కాబట్టి వృషభరాశి భగవంతుని అవతారమునకు సూచకం! శ్రీకృష్ణభగవానుడు రోహిణీనక్షత్రంలో వృషభరాశియందే కదా? అవతరించినది! అందుచేతనే **కృష్ణుడు** ఉపమన్యుఋషివద్ద శిష్యరికంచేసి **శివోపాసనచేసి** రుక్మిణీదేవికి ప్రద్యుమ్నుడనే కొడుకుని కన్నాడు! శివునిచే భస్మంచేయబడ్డ మన్మధుడేకదా ప్రద్యుమ్నుడు! వృషభం మన్మధస్థానం, కామస్థానంకూడా! పురుషత్వ సూచికంగా **"పురుష వృషభ"** అని గీతలో మార్పుగా చెప్పబడింది ఇందుకే!

## శిలాదుడే – 'నంది' :

పూర్వజన్మలో శిలాదుడనే మహర్షి రాళ్ళు ఆహారంతిని తపస్సుచేసి నందీశ్వరుడుగా మారెనని శివపురాణగాధ తెలుపుతుంది! ఆయుర్వేదశాస్త్రంలో హిమాలయాల శిలలనుండి బంకవంటి దివ్యౌషుదం **శిలాజత్** స్రవించును! దానిని తినినవారికి ముసలి తనం, మృత్యువు, యవ్వనం పోవుట జరుగదు! శిలాదులూ ఈ శిలాజగత్తును హరించుకొని కాయసిద్ధితో నందీశ్వరుడుగా మారెనేమో!

## వ్యాఘ్రచర్మము :

శివునకు పై ఆభరణములకు తోడు పులిచర్మము నడుముకు కట్టుకొన్నట్టు వర్ణించబడినది। భయంకరమైన తాంత్రికసిద్ధులు, శక్తులు పులి వంటి ప్రమాదకారి। దానిని వశంచేసుకొని యోగసిద్ధిలోని రాజసమును చంపి తనకు అలంకారముగా చేసుకొనుటద్వారా సిద్ధులవల్ల పతనంచెందని స్థితియే ఈ వ్యాఘ్రచర్మమును శివుడు ధరించుట।

ఇంకనూ వ్యాఘ్రము శక్తికి వాహనం। శక్తిని పూర్తిగా భార్యవలే వశంలో నుంచుకున్నవాడుగాన శక్తి చేయలేని పులి వ్యాఘ్రవాహనం చర్మంగా ధరించు వాడనుట ఇందులో గూఢార్థం।

## చంద్రకళ :

శివ జటాజూటంలోని లోకపావనియగు గంగ అమృతత్త్వసిద్ధిని శుద్ధ బ్రహ్మజ్ఞానం నిరంతరం స్రవించుచుండు ప్రజ్ఞను సూచించునని వేరే అధ్యాయంలో వివరించబడినది।



## 4

# ఏకాదశ-రుద్రమూర్తులు!

ఈ అధ్యాయంలో "**రుద్ర-శివతత్త్వాన్ని**" గురించిన కొన్ని ఆసక్తికరమైన విశేషాలు చాలామందికి తెలియనివి సంగ్రహంగా తెలియచేస్తాను। శ్రద్ధగా ఏకాగ్రతతో చదివి ఈ విషయాలను మనసుకు పట్టించుకోండి। అవి ఏవంటే -

1) **శివమూర్తులు** వాటి విశేషాలు
2) **శివలింగాలు** వాటి ఆకారాలలోని భేదాలు, వాటి తాత్పర్యాలు।
3) **శివాభరణాలు**, ఆయుధాలు వాటి తాత్పర్యము।
4) జ్యోతిష ఖగోళ (Astronomical) అంశాలు వేదంలో శివునికి చెప్పబడినవాటి గూఢార్థములు।
5) సైన్సుదృష్టిలో శివుడు
6) శివశక్తి అనగా ఏమిటి? **శక్తికీ — శివుడికీ** గల భేదం ఏమిటి? శివశక్తుల సంబంధమూ ఇంకా తత్సంబంధితమైన రహస్య విషయాలు।

## శివుని మూర్తులు – రూపాలు :

మనం సాధారణంగా క్యాలెండర్లపైనా, పుస్తకాలపైన, శివుడి గురించి రకరకాలుగా ఊహించబడిన బొమ్మల ఆకారాలను చూస్తాము! అవి ఏమిటో ఆకళింపు చేసుకుందాం!

మనిషి శరీరం — కుడివైపు పురుషమూర్తియైన **శివుని** ఆకారమూ, ఎడమవైపు నసీమూర్తియైన **పార్వతి** ఆకారమూ కలిసి భావించబడి — చిత్రంగాకాని విగ్రహంలాగాని రూపుదిద్దిన విగ్రహమే ఈ "అర్ధ-నారీశ్వర మూర్తి"!

## అర్ధనారీశ్వర మూర్తి :

మొదటిది శివుడి అర్ధనారీశ్వరమూర్తి! మనిషి శరీరం కుడివైపు పురుషమూర్తియైన శివుని ఆకారమూ, ఎడమవైపున స్త్రీమూర్తియైన పార్వతి ఆకారమూ, కలిసినట్టు భావించబడిన విగ్రహమే చిత్రంగా లేక విగ్రహంగా రూపుదిద్దిన ఈ అర్ధనారీశ్వరమూర్తి! 1) అనగా — కుడివైపు భస్మము, రుద్రాక్షలు ధరించి, ఎడమవైపు చీర, పమిట, మంగళసూత్రము ధరించి, 2) కుడివైపు త్రిశూలము ఎడమవైపు గాజులు ధరించిన స్త్రీ, చేతిలో భోజనపాత్ర లేక అన్నంముద్ద (అన్నపూర్ణ) లేదా జపమాల వంటివి ధరించి నట్టు వుండగా, 3) కుడివైపున బలిష్టమైన కండలు కలిగిన పురుషుని ఛాతీ కలిగివుండే శివుడూ ఎడమవైపున ఎత్తైన చనుబాలు నిండిన స్తనములు కలిగిన స్త్రీమూర్తి పార్వతి ఆకారం, 4) అలానే కుడివైపు పురుషలింగాకారము, ఎడమవైపు భగాకారము, 5) కుడివైపు పులిచర్మము కప్పుకునివుంటే ఎడమ వైపు చీర ధరించినట్టూ, ఇలా ఆపాదమస్తకం "**స్త్రీ–పురుషమూర్తి**"గా భావించ బడినదీ — **అర్ధనారీశ్వరమూర్తి!**

ఇలాగ ఈనాడు ప్రపంచంలోచూస్తే ఎక్కడా కనిపించని ఇలాంటి అసంభవమైన మూర్తిని మన పూర్వీకులు ఎందుకు వర్ణించారు?

మన పండిత కవులలో పెద్దవాడైన అల్లసాని పెద్దనామాత్యుడు తన కావ్యం ప్రార్ధనాశ్లోకంలో బాలకుడైన గణపతి తల్లి ఒడిలో కూర్చుని చేతులు చాపితే

**" అంకముచేరి శైలతనయా స్థనదుగ్ధములానువేళ..."**

అంటూ తల్లివద్ద పాలుత్రాగే పసిబిడ్డడుగా వున్న **గణపతి** పాలు త్రాగుతూ పిల్లచేష్టలతో చేతిని చాచగా అటువైపునవున్న పాము బుస్సుమని కస్సుమంటే భయపడ్డాడట! అది అల్లసాని పెద్దనగారి అల్లిక

దేవుళ్లలో ఇలాంటి ఇబ్బందికర అసంభవమైన మూర్తియొక్క అర్ధ మేమిటి? అని సైన్సు **దృష్టికల** తాత్త్వికులు, మేధావులూ ఆలోచించాలి కూడా! చాలామందికి దీని అర్ధం బుద్ధికి అందదు! ఏదో మూఢాచార మనుకొని సర్దిచెప్పుకుని మరింత మూఢత్వంలో పడిపోతారు! ఈ **అర్ధనారీశ్వర మూర్తిలోని** అంతరార్ధం సైన్సుదృష్టితో ఆలోచిస్తేనేగాని తెలియదు!

## 'స్త్రీశక్తి' – 'పురుషశక్తి' :

ప్రపంచాన్ని సృష్టించి, పాలించి, నశింపుచేసే శక్తియే భగవంతుడు! ఇది ఒక పెద్ద కరెంటువంటి శక్తి! అంటే (Power) విద్యుత్తు లేక ఎలక్ట్రిసిటీ వంటి "శక్తి"–ఈనాడు లైట్లు వెలిగించి, గాలివీచే ఫ్యానును తిప్పి, వంటచేసే పొయ్యినీ మండించి, అటు చల్లని ఎయిర్‌కండిషన్ ఇచ్చినట్టే నానా రకము లైన పరస్పర విరుద్ధమైన పనులను ఒకేసారి నడిపించగల 'ద్వంద్వ'-శక్తి — ఈ కరెంటువంటి (Dual Power) జగత్తును పరిపాలించే మహాశక్తి!

ఇప్పుడు మనం కరెంటుతీగను పరిశీలనగా చూస్తే రెండుతీగలు —

పాజిటివ్, నెగిటివ్ లేక ధనవిద్యుత్తు కుడివైపూ — ఎడమవైపు ఋణ విద్యుత్తూ, ఇలా రెండుపాయలుగా ఈ విద్యుత్తు ప్రవహిస్తుంది! ఒకటి పురుషశక్తి అనీ, రెండవది స్త్రీరూపకశక్తి అని ఈ రెండురకాల విద్యుత్తునే భావనచేశారు వేదకాలపు ఋషులు! అర్ధనారీశ్వర తత్త్వానికి మొదటి అర్ధమిదే!

## స్త్రీ పురుష-మూర్తి :

ఇకపోతే జీవశాస్త్రం (Biology) ప్రకారం ప్రాణులన్నీ జీవింపచేసే శక్తి ప్రాణశక్తి (Life Force)! అది రెండుగా విభాగమై — ఒకటి స్త్రీలోని అండాశయంలోని **'ఓవరీ'** (Ovary) లేక **అండం** (Egg) గా రూపొందుతుంది! అలానే రెండవ సగం పురుషాకారంలోని బీజరూపంగా చైతన్యంగావుండే వీర్యకణాల (Sperm) రూపంలో పురుషుని శరీరంలో శుక్లంలాగా ఏర్పడి వుంటుంది! ఈరెండూ ప్రాణశక్తియొక్క పాజిటివ్, నెగిటివ్ అనగా పురుషశక్తి, స్త్రీశక్తిగా ఒకే ప్రాణశక్తిలో భాగంగా విడివడి వుండటాన్నే ఋషులు **"అర్ధ నారీశ్వర"** మూర్తి (Hermophrodite) గా దర్శించి తల్లీ-తండ్రి ఒకే శరీరంలో వున్న ఆకృతిగా (**వానపాములోలాగ**) ఈ ప్రాణశక్తిని అండాశయం వీర్య కణముల సృష్టిక్రమాన్ని కలిపి దర్శించారు! రెండూ కలిస్తేనే కదా గర్భంలో పిండం ఏర్పడి పిల్లవాడు జన్మించేది? జంతువులలో వానపాము (Earthworm), "హైడ్రా" (Hydra) వంటి జీవులలో "స్త్రీ"యొక్క అండాశయమూ, పురుష వీర్యాశయమూ వుంటుంది మొక్కలలో ప్రతిపువ్వూ ఇలాటి "స్త్రీ-పురుష" 'ఉభయలింగ' మూర్తులే!!! ఇది అర్ధనారీశ్వర తత్త్వానికి జీవశాస్త్ర (Biology) సంబంధమైన అంతరార్ధమూ, యదార్ధమూ!

## మహాకాల-కాళుడు :

అలానే **యోగశాస్త్రం**లోకూడా దీనికి సంబంధించిన ఇంకొక గూఢార్థం కూడా వున్నది! అదేమిటంటే మన శరీరం బ్రతికివుండటానికి కారణం

మన ఊపిరి, శ్వాస అనబడే 'ప్రాణం!' ఇది మనం నిత్యం ముక్కుల్లోంచి పీల్చే ప్రాణవాయువు రూపంలో శరీరంఅంతా వ్యాపించి అన్ని అవయవా లనూ బ్రతికించివుండే లాగ చేస్తుంది! పతంజలి యోగసూత్రాలలో మనలోని కుడిముక్కులో ప్రవహించే ప్రాణాన్ని **పింగళ నాడి** అని ఎడమవైపు ముక్కులో ప్రవహించే శ్వాసను **ఇడానాడి** అని చెప్పారు!

## శివ-శక్తి స్వరూపి :

అంటే, ఒకటి పురుషశక్తి లేక ధనవిద్యుత్ (Positive) వంటి కరెంటును శరీరంలో పుట్టిస్తుంది! రెండవది ఋణ విద్యుత్తు లేక నెగిటివ్ కరెంటువంటి ప్రాణశక్తిని పుట్టిస్తుంది — ఇవి రెండూ మన శ్వాసలోని స్త్రీపురుష విభాగాలే! అంటే మనలోని ప్రాణంరూపంలో వుండే శివపార్వతులే — ఈ **ఇడా-పింగళ** నాడులన్నమాట!



అంతేకాదు, కుడివైపు పింగళనాడికి **సూర్యనాడి** అనిపేరు! ఎడమవైపు ఇడానాడికి **చంద్రనాడి** అనిపేరు! అంటే కాలంలోని సంవత్సర చక్రంలో

ఏర్పడే **అమావాస్య పౌర్ణమి** సూర్యుడూ చంద్రుడూ శుక్ల కృష్ణపక్షములలోని కలయికలవల్లనే ఏర్పడుతున్నాయి! అందువల్ల కుడివైపు శ్వాసను ఉత్తరాయణ కాలం ఆరుమాసాలనుకుంటే — ఎడమవైపు శ్వాసను దక్షిణాయనకాలమైన ఆరుమాసాలుగా ఫలితం ఇస్తుంది!

## యోగనాధుడు :

అంటే అర్థంఏమిటి? **కుడివైపు** (పింగళ = సూర్యనాడి) తో శ్వాసపీలిస్తే శరీరంలో వేడిపుడుతుంది అన్న విషయం ప్రాణాయామం చేసేవారికి తెలుస్తుంది! ఎడమవైపు ముక్కుతో (ఇడా = చంద్రనాడితో) శ్వాసపీలిస్తే శరీరం చల్లబడి చలవచేస్తుంది! అందుకని కుడివైపు సూర్యనాడి సంవత్సరంలో వేడినిచ్చే **వేసవి**కాలంలాంటి **ఉత్తరాయణ** కాలం! అనగా చైత్ర, వైశాఖ, జ్యేష్టమాసములు! అలానే ఇడానాడిలోని చల్లటి ప్రాణశక్తి ప్రవహించు శ్వాస చలినిచ్చి శీతాకాలం, శిశిరకాలం, వర్షాకాలం వంటి **దక్షిణాయన** ఫలితాలు ఇస్తుంది! అంటే కాలపురుషుని శరీరంలో రాశిచక్రమే ఆయన శరీరంలో శ్వాస అనుకుంటే మేషరాశినుండి తులారాశివరకూ వేసవి వేడినిచ్చే ఆరుమాసాలూ, సూర్యనాడి లేక పింగళనాడి అనవచ్చు! అలానే శరదృతువు నుంచి చలినిచ్చే దసరా, దీపావళి, క్రిస్టమస్ నెలలు కలిగిన ఆశ్వీజంనుండి ఫాల్గుణమాసందాకా వచ్చే ఆరుమాసాలు కాలపురుషుని శరీరమైన రాశి చక్రంలో చంద్రనాడి వంటి దక్షిణాయన కాలమన్నమాట! ఈ కాలచక్ర భ్రమణంలోని సూర్యచంద్రుల రెండిటి గతి వల్లా పౌర్ణమి, అమావాస్యలు కూడా ఏర్పడుతున్నాయి!

ఇదే విషయం 'భగవద్గీత'లో

**"శుక్లకృష్ణే గతీహ్యేతే జగతః శాశ్వతీమతే"**

ఈవిధంగా జ్యోతిషశాస్త్రం ప్రకారం యోగి తన శరీరంలో సమస్త

కాలాన్నీ దర్శించగలడు! అంటే ఉత్తరాయణ, దక్షిణాయనాలు కృష్ణపక్ష, శుక్లపక్షాలు, పౌర్ణమి, అమావాస్యలు, చలికాలం, వేసవికాలం తన శరీరం లోని శ్వాసలోనే సాధనద్వారా దర్శించి కాలచక్రాన్ని సమస్తమూ తనలో సిద్ధింపచేసుకుంటాడు!

దీనివల్ల ఉపయోగమేమిటి? కాలచక్రమే ఇలాగ తనలో సిద్ధిస్తే రేపు జరగబోయే భవిష్యత్తు గతంలో జరిగిన యుద్ధాలు, కల్పాల చరిత్ర ఇప్పుడు గడుస్తున్న కాలంలో మార్పుల్లో ఏది ఎందుకు జరుగుతున్నదో ఇలా ఎంతకాలం నడుస్తుందో తెలిపే జ్ఞానమే **కాలజ్ఞానం!** ఇలాంటి జ్ఞానాన్నిచ్చే యోగశాస్త్రసాధన ఇడా, పింగళ అనబడే **సూర్య చంద్రుల** నాడులవల్ల మన లోని శివశక్తి, స్త్రీశక్తి కాలజ్ఞానాన్నిస్తున్నాయి! కాబట్టి ఈ **కాలచక్రమే అర్ధనారీశ్వర** తత్త్వం! అనగా ఎన్నడూ విడదీయరాని జంటగా — రాత్రింబగళ్ళు, పౌర్ణమి,



అమావాస్యలు విడదీయలేముకదా! తల్లితండ్రి కాలమే — అనగా శివ పార్వతుల స్వరూపమే ఈ జ్యోతిషపరమైన శివతత్త్వరహస్యం! ఇదంతా శివుని ఒక్క అర్ధనారీశ్వర తత్త్వంయొక్క రూపంయొక్క విశేషమే ఇంతవున్నది!

## మృత్యుంజయ మూర్తి :

అలానే శివుడికి శంకరుడని హిమాలయపర్వతాలపై మంచుకొండలలో తపస్సుచేస్తూ పాడ్యమినాటి చంద్రకళ నుదుట వెలుగుతూ మృత్యువును జయించే మృత్యుంజయమూర్తిగా చెప్పబడినది! ఇది అమర్‌నాధ్‌లో **మంచు లింగము** రూపంలో భావించబడే **అమరలింగం** అనగా మృత్యువును జయించే (అమర) అమృత-కళ యొక్క రహస్యం!

జాతకంలో అకస్మాత్తుగా మృత్యు భయం కలిగితే మృత్యుంజయ మంత్రం త్ర్యంబకసూత్రం జపించాలి అంటారు! అదియే ఈ అమృతకళ — **మృత్యుంజయ శివతత్త్వం**లోని ఇంకో రహస్యం!

## ఆనంద తాండవమూర్తి :

అలానే శివుడు ఆనంద తాండవమూర్తి! అనగా ఒళ్ళు మరచిపోయే టంత ఆనందం పట్టరాని వెల్లువగా పెల్లుబికినపుడు తట్టుకోలేని బ్రహ్మ జ్ఞానుల్నీ, యోగసిద్ధి కలిగిన యోగీశ్వరులనూ చూపినవారికి తెలుస్తుంది! ఇలా ఆనందతాండవం ఒక్క శివుడేకాదు బ్రహ్మజ్ఞానం కలిగిన శుకయోగి కూడా బట్టలు కూడా లేని స్థితిలో ఒడలుమరచి ఆనందతాండవం చేశాడని పురాణాల్లో వివరించబడింది!

అలానే శ్రీకృష్ణుడు పూర్ణిమనాడు సంపూర్ణ ఆనందం వెల్లువగా వరదలై ప్రవహించగా రాసక్రీడలో ఒళ్ళుమరచి తాండవం చేశాడని **భాగవతం** చెబుతోంది! ఇంకా శ్రీరామకృష్ణ పరమహంస జీవితం, షిరిడీసాయి జీవితంలో

కూడా బట్టలు ఊడదీసి ధునిలోవేసి ఒళ్ళుతెలియని ఆవేశంలో గంతులువేసిన దృశ్యాలూ ఇలాంటివే! ఇదే **ఆనందతాండవమూర్తియొక్క యోగశాస్త్ర** రహస్యం!

## ఊర్ధ్వ-లింగుడు :

ఇంకా సృష్టిక్రియ చేసే ఉద్రేకంలో పురుషమూర్తియైన శంకరుడు ఊర్ధ్వలింగంతో పట్టరాని ఆవేశంతో దారుకావనంలో మునిపత్నులముందు నాట్యం చేశాడట! దీనివల్ల యోగి శరీరంలోని కుండలినీశక్తి విజృంభించితే అదే సృష్టిచేసే కామశక్తిగా జీవులను నాట్యం చేయిస్తుందని గూడార్థం! దీని కింతకంటే వివరాలు అనవసరం!

## ఆదిభిక్షుక-మూర్తి!

అలానే శివుడు పరమ వైరాగ్యమూర్తిగా భిక్షాపాత్ర ధరించిన "**ఆది-భిక్షుకమూర్తి**"గా **ఆదిభిక్షువుగా** చెప్పబడినాడు! అంటే బ్రహ్మజ్ఞానానికి సంపూర్ణ వైరాగ్యం కేవలం భిక్షపై జీవించుట అవసరమని యోగిరాజైన భిక్షాటనమూర్తి యగు ఆదిభిక్షువైన శివుడు ఉపదేశిస్తున్నాడు అని దీని తాత్పర్యం! ఇది భిక్షాటనమూర్తికి అర్థం!

అలానే అథర్వణ వేదంలోని సమస్త అస్త్రములు, శస్త్రములు, మంత్రాలు సిద్ధించాలంటే ఈ అస్త్రవిద్యలకు అధిపతి "**ఈశాన-రుద్రు**" డనబడే ప్రళయరుద్రుని **అఘోరమూర్తి!** ఈయనను ఆరాధించమని అర్జునుడితో శ్రీకృష్ణ భగవానుడు ఉపదేశించి **పాశుపతాస్త్రం** ఇప్పించాడని సంస్కృత భారతం చెబుతున్నది!

**ఈశాన సంహిత** అన్న మంత్రశాస్త్రగ్రంథంలో **పాశుపతాస్త్రమంత్రం**, రౌద్రాస్త్రం, అఘో రాస్త్రం, ఘోరాస్త్రం వంటి అస్త్రాలూ పరశువు ధనుస్సు

మొదలైన 'శస్త్రరహస్యాలు' **ఈశాన రుద్రుడిచే** చెప్పబడినవే! ఇప్పటికీ అస్త్ర విద్యకి **"ఈశాన సంహిత"**యే మూలగ్రంథం!

## మృగవ్యాధ-రుద్రుడు 'పినాకి' :

ఇకపోతే రుద్రుడు ధనుస్సును ధరించి, పరుగెత్తే జింకను వేటాడి మృగవ్యాధ రుద్రుడు (వేటగాడు)గా దర్శనమిచ్చే మూర్తి ఆకాశంలో ఆర్ద్రా నక్షత్రం (Orion) లో కనిపిస్తాడు వేటకాడిలాగా!

ఇది **మిథున** రాశి, కర్కాటక రాసులకు అడ్డంగా ఐమూలగా ఈ **మృగవ్యాధ**-రుద్రుని (Orion, the "Hunter" stars) రూపంగా నక్షత్రమండలం లో కనిపిస్తుంది! ఈ నక్షత్ర మండలానికి దగ్గరనుండి క్రూరగ్రహాలైన శని, కుజ, రాహువులు సంచారం చేసినపుడే **ప్రపంచ యుద్ధాలు**, అణుబాంబులు, ప్రళయాలు జరిగాయి!



గత యుగాలలోకూడా దేవదానవ యుద్ధం, మహాభారత యుద్ధమూ, హిట్లర్ ప్రపంచయుద్ధం వంటివీ జరిగాయి! అందుకే ఈ ధనుస్సు ధరించిన

ఉగ్రమూర్తియైన రుద్రుని **మన్యుదేవతా రూపం**గా వేదాలు వర్ణిస్తూ ఆయుధం శూలంకాకుండా ధనుస్సును వర్ణించాయి!

**"ధనుశ్శత్రో రపకామం ..**

**ధన్వనాగా ధన్వనాజిం జయేమ**

**ధన్వినే. శతధన్వినే అగ్రేవధాయచ**

**దూరే వధాయ చ**

**నమో హిరణ్య బాహవే.."**

అంటూ నమస్కరించి కాల-సంహారమూర్తికి వేదమంత్రాలు నమస్సులు సమర్పించాయి! ఇలా ఇంకనూ రుద్రునికి అనేకరూపాలున్నాయి! అవన్నీ విస్తరించి రాస్తే ఇదంతా ఒక **శివపురాణమే** అవుతుంది! ఇప్పటికింత చాలును!

# ఏకాదశ రుద్రులు

1) శంకరుడు
2) నీలలోహితుడు
3) అఘోరమూర్తి
4) ఈశానమూర్తి
5) రుద్రమూర్తి
6) తాపసమన్యుడు
7) శివుడు
8) ఉమామహేశ్వరుడు
9) గంగాధరుడు
10) మృత్యుంజయమూర్తి
11) చంద్రశేఖరమూర్తి

1) అజుడు
2) ఏకపాదుడు
3) అహిర్బుధ్న్యుడు
4) త్వష్ట
5) రుద్రుడు
6) హరుడు
7) శంభుడు
8) త్ర్యంబకుడు
9) ఈశానుడు
10) అపరాజితుడు
11) త్రిభువనుడు



# 5

# పంచ-శివలింగాలు!

శివుని పంచమూర్తులకు రూపాంతరాలుగా శివాలయంలోని శివ లింగాల ఆకారాలుకూడా వేరువేరు మార్పులతో చెక్కబడివుంటాయి! **"పంచ-శివలింగాల"**లోని కొన్ని విశేషాలు ఇక్కడ గమనిద్దాం!

## 1. పార్ధివలింగం :

శివుడు పంచభూతాత్మకుడు! అనగా భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము ఈ అయిదూ శివుని పంచతత్త్వాలని శివసంహితలోనూ, శివపురాణంలోనూ చెప్పబడివున్నాయి! అలానే మన శరీరంలో మూలాధారంలో పృథ్వీతత్త్వానికి సంబంధించినది **పార్ధివలింగం** అని చెప్పబడుతున్నది! ఈ పృథివీతత్త్వాత్మకమైన అన్నంతో తయారైన 'శరీరమే' — "పార్ధివలింగం"

## 2. జలలింగం :

రెండవదైన స్వాధిష్టానచక్రం లేక సెక్సుకేంద్రంలో వుండే యోగకేంద్రం శివమూర్తి **జలలింగం**గా చెప్పబడింది! ఇదే **"గంగాధరుడు"** 3) మూడవదైన మణిపూరకచక్రంలోని అగ్నితత్త్వమునకు సంబంధించిన **జ్వాలాలింగం** లేక దీనినే హిరణ్యస్థంభమని చెప్పబడింది! 4) అలానే **వాయుస్థానమైన**

తెరుచు కుంటుంది! అందులోనే ఈ సమస్త సృష్టి, యావత్ బ్రహ్మాండము, నక్షత్ర తారకామయమైన విశాలవిశ్వమంతా ఈ హృదయా కాశంలో నిండి వుంటుంది!

**"ఆత్మనః ఆకాశః సంభూతః"**

**ఆత్మ**నుండియే **ఆకాశం** పుట్టినది అని వేదము చెప్పును! అట్టి ఆకాశ తత్త్వ స్వరూపుడగు పరమాత్మయే దహరాకాశుడు! అనగా హృదయాకాశంలో వెలిగే **అరుణాచలేశ్వరుడు!** ఇంతేకాదు, హృదయంలో **రక్తం** అరుణవర్ణం కలిగివుండును! అందుకే "అరుణగిరి" నాధుడు అనగా ఎర్రనిరంగు! ఎరుపు రంగు రక్తప్రసరణకేంద్రమగు "అనాహత" యోగచక్రమును సూచించాను ఎరుపు కుంకుమ వర్ణము! అనగా పార్వతీశక్తి సంబంధమైనది!

**"అరుణాం కరుణాతరంగితాంగీం"**

అని లలితాసహస్రనామంలో జగన్మాతకు అరుణవర్ణం చెప్పబడినది! ఇట్టి అరుణవర్ణం కలిగిన హృదయమే దానిలో జ్యోతిలా వెలిగే ఆత్మయే అరుణగిరినాధుడు, అనబడే **అరుణాచలేశ్వరుడు,** ఆయనయే — మోక్షప్రదుడు! ఈ ఆత్మను ప్రతి నిత్యం స్మరించినంతనే మోక్షంకలుగును అని చెప్పుటకు కారణం! ఎందుకనగా శ్రీశైల శిఖరం దర్శించినంతనే ముక్తి — కాశీలో మరణించి నంతనే ముక్తికలిగితే అరుణాచలంలో స్మరించినంతనే ముక్తి అని —

**"కాశ్యాంతు మరణాన్ ముక్తిః**
**శ్రీశైలే దర్శనాన్ ముక్తిః**
**స్మరణాత్ అరుణాచలే!"**

ఈవిధంగా శివుని మోక్షరూపమును శోణగిరి–ఆత్మలింగం అరుణగిరి యందు, రమణమహర్షి తపస్సుచేసిన **అరుణగిరి జ్యోతి**-శిఖరంవద్దనే **కార్తీక**

**జ్యోతి**గా ఈనాటికీ కార్తీకపౌర్ణమినాడు వెలిగించి చుట్టుపక్కల జిల్లాలకు కూడా కనిపించే జ్వాలగా తొమ్మిదిరోజులుంచుతును! ఇది ఇప్పటికీ అరుణాచల క్షేత్రంలో జరిగే గొప్ప విచిత్రం!

ఈవిధంగా శివలింగాకారములు వాటి అంతరార్థాలు అనేక రకాలుగా చెప్పబడినవి! శివరాత్రిపర్వదినాన వీటిని స్మరించి, ధ్యానించి తరించెదము!

## రసలింగం – రసవాదశైవం :

పాదరసమునకు శివవీర్యమని పేరు! దీనివెనుక ఓ పురాణగాధ విచిత్ర మైనది భాగవతంలొ వున్నది! దేవతలు, రాక్షసులూ కలిసి పాలసముద్రమును చిలికినపుడు విష్ణుమూర్తి సహాయంచేత మంధరపర్వతమును కవ్వముగానూ వాసుకిసర్పము తాడుగానూ చేసి మధించారు! అప్పుడు అందులోంచి కాలకూటవిషం భయంకరంగా జ్వలిస్తూ పుట్టింది! భక్తితో శరణుపొందిన దేవాసురులకు శివుడు అభయమిచ్చి ఆ కాలకూట విషం కంఠంలోనే నిలిపి లోకాలను రక్షించి మృత్యుంజయుడైనాడు!

## శివ–గర్వభంగము :

అయినప్పటికీ తానేకదా? లోకమును రక్షించి విషాన్ని జయించితినని గర్వించినాడు! గర్వము ఆత్మజ్ఞానులకు, యోగులకు కూడా పతనహేతువే కదా? అట్టివారిని **అహంకారమునుంచి** రక్షించుటయే **నారాయణ భగవానుడగు** విష్ణుదేవుని సంకల్పము! అందుచేత విష్ణుమూర్తి జగన్మోహనకరమైన స్త్రీ రూపము ధరించి వెంటనే **మోహినీ** అవతారమెత్తినాడు!

## జగన్మోహిని :

శంఖచక్రములు మాయమై పమిటా — చెంపకు చారడేసి కన్నులూ మిసమిసలాడిన బంగారుచాయతొ సన్నని గుప్పెడు నడుముతో, బరువైన పిరుదులు, లోతుగా సుడిగుండమువంటి నాభి, తాటిపండ్లవంటి కుచ

ద్వయములూ తయారైనవి! చిరునవ్వులు చిందిస్తూ క్రీగంట అలరిస్తూ వయ్యారంగా దేవాసురులమధ్య జగన్మోహినిగా విహరించి దేవతలకు అమృతమూ, రాక్షసులకు •కల్లూ త్రాగించినాడు మాయావిఅయిన విష్ణుమూర్తి! అంతటితో ఏమయినది? ఇంకా దేవకార్యం మిగిలేవున్నది!

అలా జగన్మోహినియైన జగన్మోహనుడు — పరుగిడి బంతితో ఆట లాడుతూ శివుని ముందర వయ్యారంగా నాట్యంచేసినాడు! మెరుపుతీగవంటి జగన్మోహినిని చూడగానే శివునికి మతి చలించినది! మధ్య మధ్యలో విష్ణువు తళుక్కుమని మెరుపువలే క్రీగంట కన్నుగీటి ములకనవ్వులు విసిరినాడు! దానితో శివుని గుండె చెదిరినది! జగన్మోహిని అంగాంగముల సౌందర్యం శివుని మగతనమును కరిగించి నీరుకార్చింది! ఇంతటిలోనే జగన్మోహినికి కొప్పువీడి జుట్టు రింగురింగులుగా ఎగరసాగినది! తలలోని పారిజాతములు పరిమళం కామదహనుని హృదయమే కామంతో దహించివేసింది! ఇంక నిలదొక్కుకోలేక శివుడు — మోహిని వెంట పరుగెత్తినాడు!

"ఆగాగు! నేను కన్యను! అవివాహితను" — అంటూ వయ్యారంగా సయ్యాటలాడి జగన్మోహిని చెట్లమధ్యకు పరిగెత్తినది! ఎక్కడినుండియో వచ్చిన ఓమాయదారి గాలికి చీరకూడా పూర్తిగా ఎగిరి కొండకోనలలో వెళ్లి పడినది! దానితో దిగంబరి అయిన జగన్మోహిని కిలకిలా నవ్వుతూ శివుని చుట్టూ ప్రదక్షిణంగా పరుగెత్తినది! ఇక, శివుడు నిగ్రహించుకోలేని కామంతో ఆమెను కౌగిలించుకోబోయి సంభోగ సౌఖ్యమును కోరినాడు! — అంతే! జగన్మోహిని భయపడినట్టు నటించి శివుడు వెంట తరుముకుంటూ రాగా పారిపోయి **పార్వతి** చాటున దాగి నిలిచింది!

పార్వతి భర్త పరిస్థితిచూసి నిర్ఘాంతపోయింది! ఆపాదమస్తకం శివుని తీక్షణంగా చూసిన పార్వతి వెటకారంగా నవ్వినది! అయినప్పటికీ శివుడు ఒక్కసారి జగన్మోహినిని కౌగిలించుకొనమని బ్రతిమాలినాడు! మోహిని

చిరునవ్వుకు శివుడి ఊర్ధ్వలింగంనుండి వీర్యంపొంగి భూమిపై పడింది! ఆ వీర్యం పడినచోట కొండఅంతా **వెండిగా** మారినది! అట్లు ద్రవించిన శివవీర్యం **పాదరసమై** హిమాలయాలలో లభించునని **రసవాద శైవంలో** చెప్పను! ఈ కారణంవల్లనే పాదరసమునకు **శివవీర్యమనిపేరు!**

ఇంకొక ఆశ్చర్యమేమంటే లోహాలన్నిటిలోనూ ద్రవ్యంగా వుండునది ఒక్క పాదరసమే! ఇది ఈనాటి కెమిస్ట్రీకికూడా ఆశ్చర్యమే! అంతేకాదు పాదరసంలో కరగని లోహమేలేదు! మరియూ పాదరసమును గడ్డకట్టించుట మామూలుగా అసాధ్యం! అది ఎప్పుడూ ద్రవంగానే వుంటుంది! అట్లు ద్రవించటంవల్లనే "**రసాయన**-శాస్త్రం"లో దాన్ని శివవీర్యమని అంటారు! బంధించిన పాదరసంతో 'రసలింగం' — రసగుళిక తయారై సర్వసిద్ధులూ యిస్తుంది! ఇంకా పాదరసం లింగాకారంచేసి పూజిస్తే జీవన్ముక్తి కలుగును అని రసవాదశైవం అనబడే శైవసిద్ధాంతం చెప్తున్నది!

అలా శివుని వీర్యపతనమైన వెంటనే సిగ్గుతో శివుడు తలవాల్చినాడు! పార్వతివెనుక దాగిన జగన్మోహిని కిలకిలా నవ్వి గంభీరమైన పురుషకంఠంతో హాస్యంచేయగా — తలఎత్తిచూసినాడు! — అంతే! అక్కడవున్నది జగన్మోహిని కాదు! శంఖచక్రధరుడైన సాక్షాత్ **నారాయణుడు!** మరుక్షణంలో శంకరుడు విష్ణుమాయను గ్రహించాడు! తనయొక్క అహంకారం గర్వభంగం చేయుటకే విష్ణుమూర్తి ఈలీల చూపించాడని గ్రహించాడు!

✓నాటినుండీ శివుడు **రామతారక** మంత్రమును జపించినాడు! అంతే కాదు కాశీలో మరణించిన ప్రతీజీవికి శంకరుడు చెవిలో రామ-తారకమంత్రం ఉపదేశిస్తాడనీ! తానీ దృశ్యం ప్రత్యక్షంగా చూసితిననికూడా శ్రీరామకృష్ణ పరమహంస తన కాశీయాత్రలో వర్ణించాడు!✓



ఇలాగ రసలింగం, స్పటికలింగం, బాణలింగం, సహస్రలింగం, సైకతలింగం (ఇసుక), జ్వాలాలింగం, ఆత్మలింగమని శివమూర్తులు ఎనిమిది రకాలుగా చెప్పబడినాయి!

ఇవేకాక ఒకానొకప్పుడు బ్రహ్మ నాలుగుముఖాలతో విష్ణుదేవుని శిరస్సుగా శివలింగమున ధరించి **ముఖలింగేశ్వరుడు**గా సర్వ దేవతామూర్తియైన శంకరుడు అవతరించాడు! దీనిని ఈనాటికీ **ముఖలింగేశ్వరమ**ని పిలుస్తారు!

ఇవి శివుని పంచలింగాల చరిత్రం! ఆత్మలింగస్వరూపుడైన శివుని ఆత్మలో ధరించి అరుణాచలేశ్వరుని ధ్యానించి ముక్తిపొందెదముగాక!



6

# పంచాక్షరీవిద్య - శివాత్మసిద్ధి!

శివారాధనలో ముఖ్యమైనవి మూడుమెట్లు! అందులో 1) మొదటిది శివపంచాక్షరీ జపానుష్ఠానవిధానము, 2) రెండవది మహాన్యాస విధానం 3) మూడవది రుద్రాభిషేకము

## పంచాక్షరీ–దీక్ష :

ఇందులో మొదటిది శివపంచాక్షరీ జపవిధానము ఇది, ఐదు అక్షరములు గలిగిన మంత్రము కాబట్టి దీనికి 'శివపంచాక్షరీ' అని పేరు! ప్రణవము లేకుండా '**నమశ్శివాయ**' అనుజపమే "**శివపంచాక్షరి**"! ఈ శివ పంచాక్షరీ జపవిధానము విధివిధానముగా శివదీక్షాపరుడైన గురువునుండి గాని, యోగీశ్వరుడైన సద్గురువు నుండిగాని ఉపదేశముగా పొందవచ్చు ఇలా పొందిన మంత్రమునకు మంత్రార్ధముకూడా తెలియవలెను

## మంత్రార్థము - అంతరార్థమూ :

మంత్రార్థమనగా పైకి కనిపించే తాత్పర్యార్థము — 'భగవంతుడైన శివు నకు నమస్కారము' అని।

కాని దీనికి **అంతరార్థము** కూడా కలదు ఇందులోని ఐదు (5) బీజాక్షరములూ బైటి విశ్వములోని పంచభూతములకు సూచికములైన 'కీలకములు'। భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము అనబడే విశ్వములోని ఐదు మూలపదార్థములే ఈ **"పంచ భూతములు"**

| | పంచ అక్షరము | పంచ మహాభూతములు |
|---|---|---|
| 5 | య | **ఆకాశతత్వము** |
| 4 | వా | **అగ్నితత్వము** |
| 3 | శి | **వాయుతత్త్వము** |
| 2 | మ | **జలతత్త్వము** |
| 1 | న | **భూమి ("భూ"-తత్వము)** |

## పంచభూత - జయము :

'న'కారము భూమితత్త్వమైతే చివరిదైన '**య**'కారము ఆకాశతత్త్వము మిగిలినవన్నీ పైనచెప్పబడిన క్రమములోని 'పంచభూతములు' ఈవిధంగా ఈ పంచాక్షరముల అర్థాన్ని మనస్సుకు బాగా పట్టేలాగా భావనచేయాలి! చివరకు '**య**' అని ఉచ్చరించగానే కళ్ళుమూసుకున్న వెంటనే నీలాకాశము దృష్టిగోచరము కావాలి! ఇది "పంచాక్షరీ భావన — ఉపాసన" అనే మొదటి మెట్టు!

## 'జీవాత్మ' – 'శివాత్మ' :

తరువాతిమెట్టు ఈ విశాలవిశ్వమంతా వ్యాపించిన భగవానుడే మన శరీరములో 'జీవాత్మ' రూపములో వెలుగుతున్నాడని దర్శించుటయే తాను **జీవాత్మ**దశనుండి 'శివాత్మ'గా మారి, పరిణామముచెంది 'తరించుట' అనగా — మనలోని పంచేంద్రియములు అనబడు కన్నూ, ముక్కూ, చెవీ వంటి అవయవములద్వారా బైటి ప్రపంచాన్ని గుర్తించడమేకాక — సుఖదుఃఖాలను అనుభవిస్తాడు కాబట్టి ఈ పంచేంద్రియములే మనం చేసుకున్న కర్మను అనుభవించేందుకు ఏర్పాటుచేయబడిన ఐదు కిటికీలు లేక ద్వారములు ఈ ఐదుకిటికీలు పూర్తిగా పరిశుద్ధిచేయబడి, చెడుకర్మనుంచి ప్రక్షాళనచెందితే కష్టాల, సుఖాలరూపంలో కర్మను అనుభవించడం మాని పరమాత్మతత్త్వాన్ని అనుభవించగలుగుతాడు

అంటే **'సోహం'** "నాలోని **జ్యోతి** — భగవానుడే జ్యోతి లేక **"ఆత్మ"** అన్న యదార్థజ్ఞానం కలుగుటయే ఇలా '**శివాత్మ**'గా మారుట అనబడును

ఇలా మారినవాడు తనలోని కామమునకు, క్రోధమునకు, స్వార్థమునకు, ద్వేషమునకు లోను కారాదు! అట్లు ప్రతి చిన్నవిషయానికీ, కామ క్రోధములతో బంధింపబడివుండే దశలోని మానవుడిని వేదశాస్త్రములలో **'పశువు'** అని చెప్పబడినాడు

## జీవుని – 'పశు'బంధాలు :

"పశువు" అనగా 'నాలుగుకాళ్ళువుండే గొడ్డు' అని కాదు అర్థం! రెండుకాళ్ళ పశువు అనబడే తనలోని పశుబంధాలనుండి విముక్తి పొందనట్టి వాడు అట్టి పామర దశలోనుండి బాధలుపడేవారిని రక్షించే వాడు గనుకనే శివునికి 'పశుపతి' అనీ — **"నమః పశూనాం పతిం"** అని వేదములో చెప్పటకు కారణము

ఇలాగ జీవుడు పశువులాగ శరీరములో బంధించబడి వుండటానికి కట్టేసేందుకు తాళ్ళవంటి బంధనములే — మమకారము, ఆశ, కామము, తనకే అన్నీకావాలని దాచుకోవాలన్న లోభము, అందులో పాలుపంచుకునే ఇతరులపై ద్వేషము ఈ బంధనాలే మనల్ని కట్టివేసి శరీరంలో కట్టివేసి మనలో ఒక **ఆత్మ ఉన్నదన్న** జ్ఞానముకూడా **లేకుండా** చేస్తాయి అందుకే వీటిని **"పశుబంధా"**లంటారు

వీటిని క్రమంగా సాధనతో విడిపించుకుని బైటపడటమే దేహాత్మ విముక్తి! అనగా **"ఈ దేహమే నేను"** అన్న ధృఢమైన పశుభావమునుండి విముక్తి యదార్ధ విశ్వాసంలాగా కలగాలి! ఊరికే వేదాంతంలాగ వల్లెవేస్తే చాలదు! ఇలా పశుత్వ దశనుండి విముక్తి పొందటానికి ఆహార నియమం, మనో నియమం అనగా ఆలోచనలను గమనించి — బియ్యము చెరిగినట్లు సంస్కరించుకొనుట, మాటలు — వాక్కు నియమము అనగా వ్యర్ధమైన మాటలను, నవ్వులు, దూషణలు వంటి అనర్ధపు పనులకు జీవితం వ్యర్ధము చేయకుండుట — ఇవి, ఎంతో ముఖ్యమైన నియమాలు!

శరీరమునకు స్పర్శతో ఏర్పడే ఉపచారములు, సుఖము లేక చలీ-వేడీ, దెబ్బలు, సుఖాలు అనే సుఖదుఃఖములనుండి బైట పడుటను చర్మేంద్రియాన్ని జయించటం అంటారు బద్ధకమూ, నిద్రా, ఆలస్యమూ, సోమరితన ములనుండి జయం అనగా జడత్వమునుండి విమోచనంద్వారా ఓపికను పొందటమే!

తక్షణమే ఆహారము లభించకపోతే నిలువలేకపోవడం వంటి పశుత్వ దశనుండి శరీరాన్ని వశంచేసుకొని — దశలు దశలుగా పురోగతి సాధించి ప్రాణాయామమును బిగబట్టి జపములో కూర్చోగానే సమస్తమూ మరిచిపోయి గాఢమైన ధ్యానములో లీనమై — 'ఈ **విశ్వమే తానైనట్లు**' వుండే అనుభవాన్ని పొందటమే — "ఈ ఐదు పశుబంధములనుండీ విముక్తిపొంది — **జీవాత్మ**

యైన తాను '**శివాత్మ**'గా మారుట'' — అనబడును ఇది '**పంచాక్షరీ విద్య**' లోని మొదటిమెట్టు

## పంచకోణ–యంత్రం :

రెండవది పంచాక్షరీ మంత్రముతో పూజించుట, జపించుట, యంత్రముగా చేసి ఉపయోగించుట! ఈ 'శివపంచాక్షరీ యంత్రము' ఇది, ఐదుకోణములు గల నక్షత్రముగా వర్ణించబడినది ఇది చాలామందికి తెలిసినదే! ఐనప్పటికీ ఈ పంచకోణ యంత్రములు రెండు రకములు 1) ఒకటి మోక్షమిచ్చునది, 2) రెండవది మనిషిని మరింత భోగములోనికి దింపునది (అనగా ప్రయోగము, ఉచ్చాటన, మారణము వంటి పనులుచేసి మరింత చెడుకర్మలోనికి దిగుట!) ఈ రెండురకముల శివపంచాక్షరీయంత్రములూ ఈక్రింద చూపబడినవి

**కుడి** (దక్షిణ) **ఎడమ** (వామ) యాంత్రాలు












పైన చూపబడిన (1)నం యంత్రము **ముక్తిప్రదము**, సవ్య మార్గము అనగా కుడిచేతిమార్గము (2)నం అపసవ్యమార్గము అనగా **వామాచార పద్ధతి** ఒకటి మోక్షమునకు రెండవది బంధనము నకూ దారితీయును శివపంచాక్షరీ ధ్యానముచేసే భక్తులలో చాలామంది ఈ తేడాను గమనించరు! కాబట్టి శివపంచాక్షరీ యంత్రాన్ని పూజాపీఠంలో **పైకోణము నిటారుగా ఉండేలాగ తూర్పు**ముఖముగాగాని, **ఉత్తర**ముఖముగాగాని దిక్సూచి సహాయంతో ప్రతిష్ఠించి కదలకుండా మైనంగాని, అష్టబంధనంతోగాని అతికించి ఐదు కోణములూ కలిసే కేంద్రమున పాదరసము, నవరత్నము లతో ప్రతిష్ఠించితే మరింత బలీయంగా పనిచేస్తుంది దీనిని నిత్యం పంచోపచారములతో పూజించాలి!

## పంచోపచార–పూజ :

అనగా

1) **భూ తత్త్వమునకు** — చందనము
2) **జల తత్త్వమునకు** — టెంకాయనీళ్ళు
3) **అగ్ని తత్త్వమునకు** — దీపారాధన
4) **వాయు తత్త్వమునకు** — సాంబ్రాణి ధూపము
5) **ఆకాశ తత్త్వమునకు** — ఘంటానాదము

చివరగా "**ఆత్మసమర్పణ**"కు పుష్పము చెప్పబడినది దీనిని పూజా నంతరము "**మంత్రపుష్పము**"గా సమర్పించవలెను

ఈవిధంగా పంచాక్షరీ యంత్రమును ఉపాసించే సాధకుడు తన శరీరములోని ఐదు అవయవములలోనూ పంచాక్షరీయంత్రములోని పంచ కోణములను ధ్యానించాలి! అందుకే పైయంత్రమునకు లోపలగా మానవా కారము సూచనగా చూపబడినది

శిరస్సు పైకి **నిటారుగా** వుండే ఊర్ధ్వకోణముగానూ

రెండుచేతులూ, రెండుకాళ్ళూ మిగతా నాలుగుకోణములు విశ్వమంతా వ్యాపించినట్లు భావించాలి దీనిని నిటారుగా భావించిన **'మోక్షవిద్య'** అగును అదే నక్షత్రమూ — మానవాకారమూ — **తల్లక్రిందులుగా** భావించితే **చేతబడి,** ప్రయోగముగా ``క్షుద్రం''-వామమార్గంగా రూపొంది, దుఃఖములకు ద్వారమైన కాపాలిక, అఘోరీ తాంత్రికమార్గములకు దారితీసే 'వామాచారము'నకు సూచకము అట్టివారు మరణించిన తరువాత పిశాచములచేత పీడించబడుదురు (కొన్ని వందలఏళ్లు) కాబట్టి దానిని తప్పక విసర్జించాలి!

## మంత్ర విధానము

ఇలాగ సరైన — "సవ్య" యంత్రముతో సాధనచేసిన తరువాత, పంచకోణ యంత్రాన్ని శుభనక్షత్రమూ, శుభమైన తిథీ, యోగమూ, వారమూ, ముహూర్తమూ కలిగిన శుభదినాన ప్రతిష్ఠించుకొని తన పూజామందిరంలో ఉపాసించాలి!

అలా ఈ పంచకోణయంత్రాన్ని తన శరీరంలో ధ్యానించి ఐదు కోణముల చివరా పంచాక్షరీమంత్రములోని ఐదు **బీజాక్షరములూ** తేజస్సుతో **వెలుగు**తున్నట్లుగా చూడవలెను

ఇలా క్రమంగా సాధన పరిశుద్ధిగాచేస్తే లైటు వెలిగించగానే అందులోని ఫిలమెంటు-తీగె క్రమంగా వెలిగి ప్రకాశవంతమై లైటుగా మారినట్లు ప్రతి బీజాక్షరమూ వెలిగి ఆ బీజాక్షర సంబంధమైన తేజస్సుతో కాంతినిస్తుంది

## పంచ-(5) వర్ణములు

ఇలాగ పంచభూతాలకూ సూచకములైన పంచాక్షరములనూ ధ్యానిస్తే అవి ఐదురంగులతో పంచతత్త్వములకూ సూచకముగా వెలిగి కళ్ళు మూసు కొనగానే స్పష్టంగా కనిపిస్తాయి అనగా

1) **తెల్లటి** ముత్యమువలే లేక వెండివంటి పాదరసము వంటి ప్రకాశము

2) **పగడము**వంటి ఎఱ్ఱని (విద్రుమ) కాంతితో అరుణోదయంలా వెలుగుతుంది

3) పసుపుపచ్చని **బంగారు**కాంతి (హేమ) — బంగారుజలతారు లేక సూర్యోదయ **హిరణ్మయ** వర్ణంతో ప్రకాశిస్తుంది

4) **నీలవర్ణంతో** వెలిగి పరిశుద్ధ నీలాకాశంవలే విశ్వమంతా వ్యాపించి నిర్మలంగా వికసిస్తుంది

5) ఐదవది శుద్ధమైన తెలుపు (ధవళకాంతి)। అనగా స్ఫటికమువలే నిర్మలాకాశంలా, మనస్సు రూపంలో ఏదోషమూలేని వజ్రములోని తెలుపులాగా నిర్మలంగా ప్రకాశిస్తుంది — ఈ **నిర్మల స్ఫటికా**కారమే **శుద్ధజ్ఞానము** ఇదియే **హయగ్రీవ తత్త్వము.** సర్వవిద్యాప్రదము ఇంకనూ మోక్ష స్వరూపమైన పరశివ తత్త్వము

ఇలా ఐదక్షరములూ వాటివాటి **తత్త్వములతో** దర్శనమివ్వాలి। అప్పుడే జ్ఞానం — సాధన అనేమెట్లు సాధకుడు ఎక్కగలుగుతాడు దీనితరువాత జీవాత్మభావాన్ని దాటి పైకిఎక్కగలిగే యోగసాధన।

## యోగసాధన :

దీనికై యోగసాధన అనగా తెల్లవారుఝామునే లేచుట, ఆసనములు, వ్యాయామముద్వారా బద్ధకమును జయించుట, ఆరోగ్యమును పెంచుట (బలముకాదు!), స్నానము, శుచియైన వస్త్రధారణ, ఉద్యోగమూ, డబ్బూ, కీర్తి వంటి వ్యర్థకోరికలకై హడావుడిపడని నిశ్చల స్థిరసాధన, దీనికి ప్రాణాయామము, ధ్యానము, ధారణ ఈ యోగసాధనా విశేషాలు **'సాధనారహస్యాలు' 'నిత్య జీవితంలో యోగసాధన'** అన్న నాగ్రంధాలలో వివరంగా యిచ్చాను

దీనిద్వారా కుడిఎడమలలోగల **ఇడా-పింగళ** నాడీశుద్ధికలిగి, కుండలినీ శక్తి మేల్కొనుట, శరీరములోని ఐదు యోగచక్రములు లేక **యోగ-పద్మములు** విచ్చుకొనుట, శ్వాసద్వారా 'నేను' అన్న భావము వెన్నెముకలోని సుషుమ్నా

నాడినుండి పైకి క్రమక్రమంగా ఎక్కి థర్మామీటరులోని పాదరసములాగా లేక దీపారాధనవత్తిలోని నెయ్యివలే చివరకు శిరస్సులోచేరి కనుబొమ్మల మధ్యన భ్రూమధ్యంలో **ఐదురంగులజ్యోతి** (పంచెవన్నెల రామచిలుక)గా పంచతత్త్వములకూ ప్రతీకగా ప్రకాశించును దీనినే సంధ్యోపాసనగా ఋషీశ్వరులు వర్ణించారు అదే గాయత్రీ ధ్యానశ్లోకములోని **"ముక్తా విద్రుమహేమ నీల ధవళచ్ఛాయైః"** అన్న పాదంలో ధ్యానమూర్తిగా వర్ణించబడింది!

## సంపుటిత సాధన

పైనచెప్పిన ఐదుమెట్లు — అనగా 1) **యంత్రము**, 2) **మంత్రమూ**, 3) **పంచతత్త్వముల** సాధన, 4) **యోగసాధన**, 5) **ఆత్మసమర్పణ** లద్వారా క్రమంగా మనలోని జీవత్వభావము బల్బులా వెలుగుతూ పెరిగి చివరకు ప్రచండసూర్యునిలా ప్రకాశిస్తుంది అట్టి స్థితిని చేరుకున్నవారే శ్రీ షిరిడీ సాయినాథుని వంటి **సమర్థ సద్గురువులు**, పరమ వైరాగ్యస్వరూపులైన **అవధూత** చక్రవర్తులూ!

అట్టివారు కేవలము **దత్తమూర్తితో** సమానము వారికి చెడూ-మంచీ అన్న దోషములులేని భగవత్స్వరూపులు కాబట్టి వారి చర్యలు మన కర్మలను నిర్మూలించడానికే! అట్టివారి అనుగ్రహం లభిస్తే పశుపతియొక్క అడుగుదశలో, పశుబంధనాలలో చిక్కుకున్న జీవుడు 'దేహమే దేవాలయం'గా మారి అందులో వెలిగే **'తానే'** శివాత్మగా మారుతాడు

ఇది పంచాక్షరీవిద్యద్వారా శివోపాసనతో ముక్తిపొందుటలోని మొదటి మెట్టైన **దేహాత్మ భావ** విముక్తి అనగా — ఈ శరీరమే తాను అనే దశనుండి, భ్రమనుండి విడిపించబడటం దానికి ఈ శివరాత్రి మహాపర్వకాలంగాన అందరూ శివపంచాక్షరీవిద్యా — విధివిధానముతో శ్రద్ధతో అనుష్ఠించి తరించెదముగాక!

హరిః ఓం తత్సత్

7

# కుంభేశ్వర అభిషేకంతో - అమృతత్వం!

శివపూజలో విశేషమైనది — **'అభిషేకము'**! అన్నిదేవతలకూ అభిషేకము ఇంత ప్రధానం కాదు — ఒక్క **శివునికే** అభిషేక వైశిష్ట్యం చెప్పబడినది

**"అభిషేకప్రియో రుద్రః"**

అనగా రుద్రుడు అభిషేకమనగా మిక్కిలి ఇష్టపడువాడు! ఎలాగైతే విష్ణువు **నామసహస్ర** స్తోత్రమునకు ప్రియుడో, గణపతి భక్ష్యములకూ, మోదకములకు ప్రియుడో, సూర్యుడు నమస్కార ప్రియుడో, **చంద్రుడు అర్ఘ్య**ప్రియుడో, **అగ్ని హవిస్సు**లకు ప్రీతుడో — ఆవిధముగానే, రుద్రుడు **అభిషేకమువలననే** ప్రీతుడగును" — అని **మంత్రశాస్త్ర** సంప్రదాయం!

అభిషేకమనగా నీటితో ధారాపాతముగా స్నానము చేయించుట ఇలాగ అభిషేకం చేసేతీర్థాన్ని ముందుగా మడిగా, శుచిగా - పవిత్రమైన కలశములలో నింపుకొని సిద్ధంచేసుకోవాలి! ఆతరువాత చందనమూ, ఏలకులూ, పచ్చకర్పూరము వంటి సుగంధవస్తువులు ఈ తీర్థములో అభిక

రించి, అభిషేకజలాన్ని ప్రీతిగా, సుగంధంగా వుండేలాగ తయారుచేయడం అభిషేకవిధానంలో ముఖ్యమైన మెట్టు!

అభిషేకములో పన్నీరు (పుష్పసారము), సెంటు, చందనము, పచ్చ కర్పూరం పొడి, ఏలకులు వేసిన తీర్ధమును గుండ్రని పవిత్ర కలశములో నింపి దానిలో పంచ పల్లవములు — అనగా మారేడు, మామిడాకులు, తులసి, ఉత్తరేణి, దర్భలు, అక్షతలు, పుష్పములు, నవరత్నములూ వేసి **"కలశ-పూజ"** చేయాలి! ఈ కలశమే బ్రహ్మాండ స్వరూపము

## కలశారాధన :

అందువలన కలశపూజ ఈ రుద్రాభిషేక విధానములో చాలాముఖ్యం! చాలామందికి గ్రుడ్డిదర్బారుగా — **కలశపూజను** ఎందుకు చేస్తారో దాని అర్ధమూ, అంతరార్ధమూ తెలియనే తెలియకుండా మొక్కుబడి తీర్చు కున్నట్లుగా కలశారాధన చేస్తారు!

కలశమునకు మంత్రశాస్త్రములో **"పూర్ణకుంభ"**మని పేరు! ఇది రాశి చక్రము (Zodiac) లో **కుంభరాశిలో** బృహస్పతికూడినప్పుడు ఆ కుంభరాశి లోనే **పూర్ణిమా చంద్రుడు** కలిసిన పవిత్ర **పూర్ణిమా కుంభమే** — ఈ **పూర్ణ కుంభమునకు** సూచకము!

ఎందుకంటే గత బ్రహ్మకల్పంలో ఈ జగత్తుకు ప్రళయం వాటిల్లి, సమస్త జీవరాసులూ, వృక్షములూ, ఓషధులూ నశించిపోగా, బ్రహ్మదేవుడు భవిష్యత్ సృష్టికోసం ప్రతీ జాతియొక్క విత్తనాలను ఒక పూర్ణకుంభంలో నింపి, దానిలో అమృతాన్ని పోసి సముద్ర జలాలతోపాటు సృష్టిలోవున్న అన్ని నదులలోని జలాలతోనూ నింపి, గాయత్రీ మంత్రంతో మంత్రించి తన **ప్రాణశక్తిని** ఆవాహనచేశాడట!

ఆ పూర్ణకుంభంపైగా కంఠములో త్రిమూర్తుల కళలను స్థాపించి ముఖములో విష్ణువూ కలశపు కంఠములో రుద్రుడు కలశము కడుపులో సమస్త నదులనూ, సముద్రముల జలాన్నీ గంగాజలాన్నీ ఆవాహనచేసి సృష్టికి బీజములైన విత్తనాలను అందులో అక్షతలుగా నింపాడు

దీనికి రక్షగా పైన కలశం మూతివద్ద సమస్త వేదమంత్రాలనూ దర్భలుగాచేసి రక్షగా నిలిపాడు దాని శిరస్సున ఓంకారమైన ప్రణవమును '**అ**'కార, '**ఉ**'కార 'మ'కారముల సంపుటిగాచేసి "**ప్రణవ స్థాపన**" చేశాడు అప్పుడు తాను ప్రాణాయామంచేసి పరమాత్ముడైన శ్రీమన్నారాయణుని "నారము"గా బావించి కలశములోకి ఆవాహన చేసినాడట!

అప్పుడు కలశములోనికి ప్రాణస్వరూపిగా శ్రీమన్నారాయణుడు అందు లోకి ప్రవేశించి ఆ పూర్ణకుంభమును **గర్భకలశముగా** సృష్టికి మాతృగర్భముగా చేసి సమస్త ప్రాణులనూ అందులోవుంచి సృష్టిచేసే బీజములను బ్రహ్మకు అందచేసాడట!

ఆ పుణ్యస్థలమే దక్షిణభారతదేశంలో ప్రసిద్ధిపొందిన '**కుంభకోణము**' అనబడే **కుంభరాశి**యొక్క మూలత్రికోణ క్షేత్రమని ఆ శని-క్షేత్రమహాత్మ్యం తెలుపుతున్నది

## అమృత లింగం – అమరనాథ్ క్షేత్రం

ఇలా పూర్ణకుంభమును ఆవాహింపచేసి ప్రాణప్రతిష్ఠచేసిన అమృతాన్నే కలశధారగా నిరంతర ధారాపాతంగా భూమిపై అభిషేకించారు కేవలం మట్టి మీద అంతటి అభిషేకంచేస్తే బూమి కొట్టుకొనిపోతుందికనుక ఆ కలశాభి షేకాన్ని హిమవత్పర్వత శిఖరమైన **కైలాసగిరివద్ద** అభిషేకంచేసిన — అద్భుత స్థానమే — సృష్టికి మృత్యువులేని '**అమృత**'స్థానమైంది దానినే ఈనాటికీ

యాత్రీకులు **అమర్‌నాథ్‌**లోని **మంచులింగం**గా (అమరత్వానికి నాధుడు) దర్శించి ఆరాధిస్తున్నారు

## 'కుంభ'–పూర్ణిమ (పూర్ణకుంభమేళా) :

ఏనాడైతే **కుంభరాశి**లోని బృహస్పతికి ఎదురుగా **పూర్ణిమచంద్రుడు** ఏర్పడతాడో సరిగ్గా ఆ పవిత్ర శ్రావణపూర్ణిమనాడే అమర్‌నాథ్‌లోని మంచు లింగం ఏర్పడుతోంది ఈనాటికీ! ప్రకృతి సహజంగా జరిగే ఈ **అద్భుతం** ఒక సైను వింత!

గత బ్రహ్మకల్పంలోని సృష్టి సంకల్పానికి ఇది ఒక ప్రత్యక్ష నిదర్శనం! సైన్సుకి అంతుబట్టని ఆశ్చర్యం! ఈ కారణంవల్లనే **కుంభరాశి** (Aquarius) పరమపవిత్రమైనది 'అమృతస్థాలి'గా **"పూర్ణ కుంభము"** అన్నపేరుతో అన్ని శుభకార్యములకూ, మొదట 'బ్రహ్మ'గా పురోహితుడే — గతంలో బ్రహ్మదేవుడు చేసిన కల్పమునంతా సంగ్రహంగా **"కలశపూజ"**గా ప్రతి కుంభాభిషేకమునకూ ముందుగా చేస్తాడు

## "కుంభ సంభవులు" – 'అగస్త్యుడూ–వశిష్టుడూ!'

ఇలాగ బోర్లించబడిన పూర్ణకుంభం లోనుంచి సృష్టికి ఆది పురుషులూ, బ్రహ్మజ్ఞానులూ ఆదిగురువులుగా **ఇద్దరు మహామునులు** అవతరించారు! అందులో మొదటివాడు వశిష్ఠుడు ఆతరువాతివాడు అగస్త్యుడు ఒకరు తెల్లని తేజస్సుతోనూ, అగస్త్యుడు నీలమైన తేజస్సుతోనూ — అధిదేవతలైన **మిత్రా వరుణుల** అంశలతో అవతరించారు ఈ కారణంచేతనే అగస్త్యుడూ, వశిష్ఠుడూ ఇరువురూ '**కుంభ సంభవు**'లని నిగూఢార్ధముతో చెప్పుటకు కారణమైంది

ఇలా ఒకసైన్సు లేబొరేటరీలో కృత్రిమ వీర్యకణములు-అండములూ

కలిపి ఫలదీకరణ (Fertilization) తొ పిండమును తయారుచేసినట్లే గుండ్రని కలశము అనబడు రిటార్ట్ (Retort) అనే సైన్సుపాత్రలో చేసిన సృష్టికోసంచేసే ఎక్స్‌పెరిమెంటె ఈ కలశావాహనగా తెలుసుకోవాలి!

ఈ కారణంచేతనే శివాభిషేకమునకూ కూడా **కలశపూజ**, కలశావాహన, సహస్రకలశాభిషేకం వంటివి ప్రాముఖ్యతనందుకున్నాయి!

## అపమృత్యు నివారణ – రుద్రాభిషేకమూ!

జాతకంలో అపమృత్యుగండములూ మారక దశలూ ఏర్పడినవారికీ అనారోగ్యభయమూ, రోగభయమూ, శత్రుభయం వంటివి కలిగినప్పుడూ '**మృత్యుంజయ** మంత్రము'తోపాటు '**అమృత బీజాక్షరము**'తో ఆవాహనచేసి ఆ నీటిని అమృతీకరణంచేసి ఆపైననే వాటిని అభిషేకంచేయాలి! ఊరికే శివలింగంపై గిన్నెతో నీళ్ళుపోస్తే అభిషేకం కాదు! — నీరు వృధా అవుతుంది అంతే!

## 'నిర్విషీకరణం'తో – రుద్రాభిషేకం

దీనికి కారణం ఏమిటీ అంటే — వేదము నీటిలో విషం వుంటుందనీ దీనిని '**గరము**' (విషము) అంటారనీ వర్ణించింది! యిట్లు 'స+గరము' అనగా విషము కలిసివుండుటవలననే "**సాగరము**" అని సముద్రాన్ని వర్ణించింది దీనికి యింకొక దృష్టాంత మేమిటంటే విష్ణుమూర్తి సలహాపై దేవతలూ, దానవులూ సముద్రాన్ని చిలికినప్పుడు అందులోంచి ముందుగా "హాలాహల'మనే విషం పుట్టింది దానిని నిగ్రహించినవాడే రుద్రుడు! నల్లగా మాడిన కంఠంతో "**కాలకంఠుడు**" లేక 'నీలకంఠుడు'గా మారినాడు

**ఇలా నీటిలో ఏర్పడిన విషంవల్ల పంపునీరు అభిషేకానికి ఉపయోగ** పడదు! నీటిని నదినుండిగాని, బావినుండిగాని, చెరువులోనుండిగాని —

**భూమితో స్పర్శగల సజీవమైన జలాన్నే కడవతో తేవలెను!!** అప్పుడే ఆ నీటిలో ప్రాణశక్తి ఉంటుంది! ఆతరువాత ఆ నీటిలోని విషాన్ని **"నిర్విషీ కరణం"** చేయాలి! అనగా మంత్రశాస్త్రంలో చెప్పిన **'అమృత బీజాక్షరం'** జపించి, **తార్క్ష్య-ముద్ర** (గరుడముద్ర)ను పట్టితే ఆ నీరు నిర్విషమై "**అమృతీ కరణ** జరుగును"

ఆతరువాత 'సురభిముద్ర' (కామధేనువు), గరుడముద్ర (అమృతమును తెచ్చినవాడు) తార్క్ష్యముద్రలనుపట్టి **నిర్విషీకరణం** చేసిన అభిషేకజలాన్ని శివ పంచాక్షరితో ఆవాహనచేసి పవిత్రీకరణ చేయాలి! అలా శుద్ధిచేసిన — ఆ **జలాన్నే** అభిషేకానికి వినియోగించాలి!

## "పవిత్ర"-ధారణా – అమృతీకరణమూ!

దేవలోకంనుండి గరుత్మంతుడు అమృతమును తెచ్చుచున్నప్పుడు పాములు వాటికై ముందుకు చొరబడగా ఆ **అమృతపు** చుక్కలు దర్భలపై పడినవి! అందుకని కలశమున **దర్భలతో** నీటిని అమృతీకరణం చేయవలెను దర్భలతో చేసిన ఉంగరాన్నే **'పవిత్ర'**మంటారు!

ఈ పవిత్రాన్ని సూర్యగ్రహానికి చెందిన ఉంగరపువ్రేలికి ధరించాలి! అప్పుడు సూర్యుడు శ్రవణం-ధనిష్ఠల మధ్యన అమృతస్వరూపుడిగా వుండగా కుంభసంక్రమణ పుణ్యకాలంలో ఇచ్చే 'అమృతకిరణము'ను ఆకర్షించి ప్రసారము చేసినట్లగును ఇది కలశారాధనలో గల ముఖ్యమైన శివాభిషేక రహస్యము!

ఇది కేవలము డబ్బుకోసం రుద్రాభిషేకాలు చేసే శివదీక్షాపరులకు తెలియని రహస్యము గ్రుడ్డిగా శివలింగంపై నీళ్ళు పోయడమే రుద్రాభిషేక మనుకునే మూఢభక్తులకు, అందని రహస్యము ఇది తెలిసి సంపూర్ణ

భావముతో కలశారాధన, పూర్ణకుంభమున అమృతీకరణ చేసిన జలముతో 11 సార్లు 'ఏకాదశవార–రుద్రాభిషేకం" చేయాలి।

అలా చేయటంవల్ల నెలలో అతిపవిత్రమైన పుణ్యతిధియనబడే ఏకాదశీ **తిథి** యొక్క పుణ్యబలాన్ని ఈ రుద్రుడు **ఏకాదశ** రుద్రులుగా ప్రసాదించును

## ఏకాదశీ–రహస్యము :

ఐదు 5–పంచేంద్రియాలు (జ్ఞానేంద్రియాలు) మరి ఐదు (5) కర్మేంద్రియాలూ కలిసి — దశేంద్రియాలు (10) మనస్సుతో కలిసి ఏకాదశ–(11) తత్త్వములగును ఈ రహస్యమును అందించుటకే వేదవ్యాసమహర్షి సూచనగా శ్రీమద్భాగవతంలోని **ఏకాదశస్కందములోనే** మోక్షవిషయాలన్నీ గుంపించినాడు

ఈవిధంగా కలశారాధనచేసి శివనామములతో **"నమకము"** అనగా నమస్కార పురస్సరముగా శివుని స్తుతిస్తూ చేసే కలశాభిషేకమే "ఏకాదశ రుద్రాభిషేకం" **ఏకాదశ–రుద్ర** సంబంధములోని రహస్యమిదే। ఇది మృత్యుభయాన్ని పోగొట్టును ఎందుకనగా అమృత-తత్త్వమును ఆవాహనచేసినట్టి పూర్ణకలశము కాబట్టి। అమృతమువంటి పాలతో నిండిన తల్లి చనుబాలు బిడ్డకు ప్రాణమిచ్చినట్టే ఈ పూర్ణకుంభముకూడా భక్తుని అనుగ్రహించి పోషించి రక్షించును ఇదియే పూర్ణకుంభారాధనతో జరిపే శివాభిషేక రహస్యము

## చంద్రశేఖరుడు – అమృత-కళ!

శివాభిషేక రహస్యములలో ముఖ్యమైనది — లలాట చంద్రశేఖర మణిగా వెలిగే చంద్రకళ। చంద్రుడు వేదములో **సోముడని** చెప్పబడెను అనగా అమృతస్వరూపుడు। అంతేగాదు **సోమలతకు** అధిష్ఠానమైన అమృత మూర్తియే చంద్రుడు ఈ కారణంచేత అమావాస్యవరకూ క్షయమైన చంద్రుడు తన ఆఖరిదైన 16వ కళయైన 'అమృతకళ'తో తిరిగి శుక్లపక్షములో వృద్ధి

పొంది పూర్ణిమాచంద్రుడగుచున్నాడు। కాబట్టి లలాటచంద్రుడు అమృత కళకు సూచకము

సోముడనబడే ఓషధీపతియగు చంద్రుడు ఈ పునరుజ్జీవనకు మూల సాధనమగు శక్తిని వర్షించును ఈ **చంద్రకళ** యోగిశిరస్సులో సహస్రారము నకు ముందుగానూ, భ్రూమధ్యమగు కనుబొమ్మలకు మధ్యన పైనగానూ వెలుగుతుంది

ఈ కారణంచేత శివునకు శిరస్సున **చంద్రకళ** చెప్పబడినది అదే శివలింగముయొక్క శిరస్సున **అర్ధచంద్రాకారంలో** చంద్రవంక పొడలాగా, రత్నంలోని మణిలాగ మెరిసేరవ్వలాగ వెలిగే వెలుగుకిరణంవున్న స్ఫటిక లింగంపైన అభిషేకంచేస్తే — ఈ లలాట చంద్రశేఖరుని అర్ధం పూర్తిగా యదార్ధమై సిద్ధిస్తుంది *

ఇది **శివరాత్రినాడు** పారాయణగా చదువవలసిన మహిమాపూర్వకమైన ఉపదేశము దీనిని మనస్సున ధారణచేసి రుద్రాభిషేకం చేయాలి। శివలింగం పైని చంద్రకళ **అమృతకళ** అనబడే **షోడశీకళ**। రుద్రాభిషేకం వలన ఈకళ వృద్ధిఅయి అమృతత్త్వసిద్ధి నిస్తుంది

అందుకే రుద్రమంత్రం — **"నమస్సోమాయ చ రుద్రాయచ"** అంటూ ప్రారంభించుటకు కారణమైంది।



---

* ఇదే **సోమనాధ్**లోని రహస్యం। చరిత్రలో ఒకప్పుడు **చంద్రకాంత**శిలతో చెక్కిన శివలింగం, తలపై తెల్లని **చంద్రవంకవంటి** జ్యోతి వెలిగే స్ఫటిక లింగం సోమనాధక్షేత్రంలో పూజలందుకుంటూ వుండేది **కలియుగం** బలమై, ప్రజల పాపాలు ఎక్కువై ఆ చెడుకర్మ ఫలితంగా గజనీమహమ్మద్ రూపంలో ఈ సోమనాధక్షేత్రం ధ్వంసం చేయబడినాకే భారతదేశపు స్వాతంత్ర్యం పోయింది।

# 8

# మహాన్యాసము - రుద్రాభిషేక రహస్యములు!

శివ భక్తులైనవారు చేసే రుద్రాభిషేకములలో ముఖ్యమైనది **"మహా న్యాసము"** మహాన్యాసమనగా కాలచక్రములోని సంవత్సరమూ, మాసమూ, పౌర్ణిమా, అమావాస్య మొదలుగాచేసే సమస్త యజ్ఞములనూ యజమానుడు తన శరీరములో న్యాసముచేసుకొని రుద్రాభిషేకముచేసే తానే కాలసంవత్స రాత్మకుడైన రుద్రతాభావాన్ని ఆవాహన చేసుకోవాలి! అందుకే

**"నా రుద్రో రుద్రమర్చ్యయాత్"**

అనగా "తాను రుద్రత్వమును పొందకుండా ఎవరునూ రుద్రాభి షేకము చేయరాదు!" అని శాస్త్రవచనము ఈ **రుద్రత్వమును** పొందటానికి కాలస్వరూపి కావటానికి చేసే ప్రక్రియయే **"మహాన్యాసము"** ఈ మహా న్యాసములో **'కాలము'** సర్వమునూ **సంహరించేది** కనుక అభిషేకము చేయు యజమానుడు **తానే కాలాత్మకుడై** యజ్ఞస్వరూపాన్ని శరీరంలో న్యాసం

చేసుకోవాలి। అందుకని 'దర్శ', 'పూర్ణిమాస' 'ఇష్టు'లనబడే పూర్ణిమా, అమావాస్యలలో చేసే వ్రతములు, సంవత్సరచక్రమైన యజ్ఞచక్రములను ఒక్కొక్కటే శరీరంలో న్యాసంచేస్తారు అది ఎలానో ఈక్రింది మంత్రము తెల్పుతుంది

**ఓం అగ్నిహోత్రాత్మనే - అంగుష్ఠాభ్యాం నమః - జ్ఞానాయ హృదయాయ నమః**
**ఓం దర్శపూర్ణమాసాత్మనే - తర్జనీభ్యాం నమః - ఐశ్వర్యాయ శిరసే స్వాహా**
**ఓం చాతుర్మాస్యాత్మనే - మధ్యమాభ్యాం నమః - శక్త్యై శిఖాయై వషట్**
**ఓం నిరూఢపశుబంధాత్మనే - అనామికాభ్యాం నమః - బలాయ కవచాయ హుం**
**ఓం జ్యోతిష్టోమాత్మనే - కనిష్ఠికాభ్యాం నమః - తేజసే నేత్రాభ్యాం వౌషట్**
**ఓం సర్వక్రత్వాత్మనే - కరతల కరపృష్టాభ్యాం నమః - వీర్యాయ అస్త్రాయ ఫట్**
**భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః**

ఇలా న్యాసము చేయుటకు ముందుగా మృత్యుంజయుడు, మృత్యు పతియైన రుద్రునకు గల ఐదుముఖములనూ భావనచేసి ధ్యానించవలెను

## రుద్రుని ఐదుముఖములు :

వేదంలో వర్ణించిన ప్రకారం రుద్రమూర్తికి ఐదు ముఖములు గలవు। అందు మొదటిది

1) **తత్పురుష మూర్తి** . ఆయన ముఖము ప్రళయాగ్నిలో వెలిగే విద్యుత్ కరెంట్ వంటి వర్ణము కలిగివుండును
2) **అఘోర మూర్తి** ఇది మేఘమువలే పొగలాగ నీలమూ, నలుపూ కలిసిన నల్లని తుమ్మెద నీలపు రంగుకలిగి భయంకర మైన ఘోరమూర్తి ముఖము కలిగివుంటుంది
3) **సద్యోజాత మూర్తి** ఇది చంద్రునివలే, తెల్లగా పాలవలే, తెల్లకలువ

పూవు వలే లేత పసుపురంగు కలిసిన తెలుపు రంగుతో ధవళ కాంతితో వెలుగును

4) **వామదేవ మూర్తి** మొగలిపూవు రంగులో లేక గౌర వర్ణముతో ప్రకాశించు ముఖము గలది ఈ 'వామదేవ మూర్తి'।

5) **ఈశాన మూర్తి** ఇది ఆత్మ స్వరూపము కాబట్టి శుద్ధ స్ఫటిక సంకాశము తేజోమూర్తిగా అనగా మధ్యాహ్న సూర్యుని లోని స్ఫటిక శ్వేత నిర్మలాకాశ వర్ణముతో 'ఈశాన మూర్తి' ప్రకాశించును

ఈ ఐదుముఖములూ **బోధాయన** మహర్షి ప్రోక్తమైన **మహాన్యాస** రుద్రాభిషేక విధానములో ఈక్రిందివిధంగా చెప్పబడినాయి

**తత్పురుష మూర్తి — ప్రళయాగ్ని విద్యుత్‌వర్ణం**
**అఘోర మూర్తి — మేఘపుకాటుక నల్లని తుమ్మెదనీలం**
**సద్యోజాత మూర్తి — చంద్రకుంద ధవళం**
**వామదేవ మూర్తి — గౌరవర్ణం**
**ఈశాన మూర్తి — తేజోమూర్తము - ఆకాశవర్ణము.**

పై ఐదు (5) ముఖములనూ — **"ఓం నమో భగవతే రుద్రాయ"** అన్న రుద్ర మంత్రముతో రౌద్రీకరణంచేసి 'నిధన పతయే నమః' అని మృత్యువును ఆహ్వానముచేసి, **అమృతీకరణము** చేసిన జలముతో అభిషేకము ద్వారా మృత్యు నివారణచేసి **మృత్యుంజయతత్త్వము** లభింపచేయు ప్రక్రియకే ఈ **"మహాన్యాస పూర్వక రుద్రాభిషేక విధి"** అని పేరు।

## మహాన్యాసము లోని రహస్యములు :

ఎవరీ రుద్రుడు? ఎవరీ అష్టమూర్తి? పైనెక్కడొ అమెరికాలో నున్నట్లు ఉండేవాడుకాడీ రుద్రుడు। ఈ రుద్రుడు **మనలోని** ప్రాణస్వరూపుడై ఉండును అందుచేత మహాన్యాసములో ముందుగా

"హంస హంసాయ విద్మహే - పరమహంసాయధీమహి తన్నోహంసః ప్రచోదయాత్" — అన్నమంత్రముచేత ప్రాణస్వరూపుడైన హంసమూర్తిగా జీవుడైన శివుని ఆరాధించవలెను ఆ తరువాత మృత్యువును నివారించకల "త్రయంబక రుద్రుని" మృత్యుంజయమంత్రంతో 11వ అనువాకం లోని మంత్రంలో చెప్పినట్లు ఈక్రింది విధంగా ధ్యానించాలి!

**ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం**
**ఉర్వారుకమివ బంధనాన్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్**
**యో రుద్రో అగ్నౌ యో అప్సు య ఓషధీషు**
**యో రుద్రో విశ్వా భువనా ఽఽవివేశ**
**తస్మై రుద్రాయ నమో అస్తు ॥**

## రుద్రులు అనేక వేలమంది :

వేదాలలోని మంత్రార్ధమునుబట్టి చూడగా నిజానికి రుద్రుడొక్కడు కాదు! **అనేక వేలమంది** కలరు అని రుద్రాధ్యాయంలోని 11-వ అనువాకం లోని ఈక్రింది శ్లోకం స్పష్టంగా తెలుపుతోంది

**"సహస్రాణి సహస్రశో యే రుద్రా అతి భూమ్యాం**
**శేషాధమ్ సహస్రయోజనే అవ"**

(వేలకొలదీ సహస్రముల సంఖ్యలో ఉన్నట్టి రుద్రులు ఎవరైతే కలరో, ఎవరు భూమిని అధిష్ఠించి వెయ్యి యోజనముల దూరముదాకా విస్తరించి వున్నారో అట్టి రుద్రులు నన్ను ఆవేశించి రక్షింతురుగాక! — అని మంత్రార్ధము)

దీనినిబట్టి **"రుద్రగణములు"** అని చెప్పబడు దేవతల గణమునకు ముగ్గురు చొప్పున **ఏకాదశ రుద్రమూర్తులకూ** కలిసి

11 × 3 = **33 కోట్ల రుద్రగణములు** ఈ భూమినీ, ఆకాశమునూ, అంతరిక్షమునూ, జలమూ, వాయువూ, శరీరమునూ, ప్రాణమునూ, మనస్సునూ ఆవరించియుందురని వేదము తెలుపుతున్నది అనగా మన శరీరములోని రక్త కణములు (Blood Corpuscles), వంటి సూక్ష్మమైన **కణములు** (Cells) అనబడే జీవకణాలు (Prana Corpuscles) సమస్తమూ రుద్రులలోనివారే! ఆకాశములో తేలుతూ వుండే అణువులు (Atoms) కూడా ఈ రుద్రకణములే వాటిని ప్రాణశక్తిచేత ఆవాహనచేసి శ్వాసద్వారా పీల్చి, అమృత బీజాక్షరంతో సంపుటిచేసి శరీరాన్ని, మనస్సునూ అమృతీకరణచేసే ప్రక్రియయే ఈ **రుద్రాభిషేక విద్య!**

ఇట్లు అమృతీకరణ చేసిన జలమునూ, పాలనూ, తేనెనూ పంచామృతములనూ శిరస్సుపై అభిషేకం చేయాలి!

## శిరస్సే – శివలింగం!

చాలామంది శివలింగం కేవలం బండరాయిగా భావిస్తారు. 'స్థాణుః' అన్న పదమునకు 'స్థిరముగా నుండునది' అనిఅర్థము! ఈ ప్రపంచములో గాలీ, నీరూ, అన్నీ చంచలమైనవే! మనస్సూ చంచలమైనదే! స్థిరమైనది ఒక్క **పరబ్రహ్మతత్త్వమే!**

అట్టి బ్రహ్మస్థానమైన **శిరస్సే** శివలింగం! అందుచేత మహాసంకల్పము చేయువాడు వ్రేళ్ళతో ముద్రను పట్టి **శిరస్సుకు తాకించును**

అంతేకాదు — తలపై వెంట్రుకల మధ్యన పిలక యుండు స్థానములో కనిపించే **సుడి** — దీనినే **'శిఖ'** అంటారు ఇదే **"రుద్రస్థానము"!!** అందుకే గాయత్రీ సంధ్యావందన మంత్రములలో **"రుద్రశ్శిఖాః"** అనీ, **"విష్ణుర్ హృదయగ్ం"** అనీ శరీరంలోవుండే ఆయా దేవతాస్థానములు వేదములో

స్పష్టముగా చెప్పబడినవి ఈ **'శిఖ'** అనగా అగ్నిస్థానము (**అగ్నిశిఖయని** అర్ధము) దీనికి ఋజువుగా నెమళ్ళకు తలపై శిఖ ఇదేచోట వుండుటవలన దానిని **"శిఖిపింఛ"**మని చెప్పబడును

'శిఖి' యనగా అగ్నిహోత్రుడు కృత్తికలు! అనగా ఈ శిఖి స్థానము మేషరాశిలోనిది! కాలపురుషునికి శిరస్థానము-**అగ్నిస్థానము!** కాబట్టి శిరస్సు లోని సహస్రారమునకు వెనుకగా ఉండు ఈ పవిత్ర నరముల కేంద్రము (కూడలి)కి గుర్తుగా ఉపనయనమప్పుడు వటువునకు పిలకపెట్టి **"పంచ-శిఖలు"** ఉంచుతారు

## పంచశిఖలే – పంచాగ్నులు :

శిరస్సులోని పంచాగ్నులే ఈ "పంచశిఖలు!" ఇవే రుద్రుని పంచ ముఖములు! ఈవిధముగా యోగరహస్యములతో సంపుటిచేసి మహా న్యాసముతో తానే రుద్రుడు కావలెను! దీనినే **"రౌద్రీకరణ"**మంటారు

ఈ రౌద్రీకరణమువలన **సకల రోగములూ నశించును** అందువలననే రుద్రునికి **"జ్వరహరు"**డని పేరు దీనికి నిదర్శనముగా వేదమంత్రము

**"అయం మే విశ్వభిషజో**
**అయం శివాభిమర్శనః"**

(ఈ రుద్రుడే విశ్వమునకు వైద్యుడు ఈ రుద్రుడే శివత్వము లేక శుభత్వము ప్రసాదించును) అని చెప్పుటయేకాక

**"ఏతో సహస్రమయుతాన్ పాశాన్**
**మృత్యో ర్మర్త్యాయ హంతవే"**

(అనగా "ఇతడే రుద్రుడు! వేలకొలది, పదివేలకొలది **యమపాశముల** నుండి మృత్యువునుండి నన్ను రక్షించుగాక! దీర్ఘాయుష్షను ప్రసాదించును

గాక!") అనిచెప్పి ఈ మృత్యువునకు కేంద్రమెక్కడున్నదో తరువాతి అనువాకములో ఇట్లు చెప్పబడినది

**"తాన్ యజ్ఞస్య మాయయా**
**సర్వానవ యజామహే"**

(ఈ సమస్తమూ యజ్ఞముయొక్క మాయాశక్తివలన నా శరీరమంతయూ క్రొత్తగా యజ్ఞరూపమగునట్లు ఆత్మజ్ఞానముగా భావించుచున్నాను. ఓ ప్రాణములకు కేంద్రమా!

**"ప్రాణానాం గ్రంథిరసి రుద్రో మావిశాంతకః నమో రుద్రాయ విష్ణవే!"**

ఇట్లు **మృత్యువునుండి రక్షించు రుద్రుడు విష్ణవే!** — అట్టి విష్ణువునకు నమస్కారం! **'మృత్యుర్మేపాహి'!** మృత్యువునుండి నన్ను రక్షించునుగాక" అని విష్ణువును స్మరించి రుద్రభూమికి పోకుండా (అనగా మరణించకుండా) మృత్యుపతికి నమస్కరించి — అమృతపతియగు విష్ణువును శరణుపొందు చున్నాను!) అని అర్థము! ఈ రహస్యమును చాలామంది రుద్రాభిషేకము చేయువారు గమనించరు!

దీనికింకా ఋజువుకావలెనంటే "**శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము**"లోని విష్ణుదేవుని నామములలో **'సర్వః'** "**శర్వః**"అనీ, "**శివః**"అనీ, "**స్థాణుః**" అనీ **రుద్ర** నామములే **విష్ణునామములుగా** చెప్పబడినవి

**"సర్వశ్శర్వ శివస్థాణుః భూతాదిర్నిధి రవ్యయః"**

ఇదే మహాన్యాసపూర్వక రుద్రాభిషేక రహస్యమునకు **'కీలకము'!**

ఇంకనూ పూర్తిగా **రుద్రసూక్తమునకు** అనువాదము, విశేషార్థములతో దీనికి అనుబంధముగా ఇక్కడ ప్రచురిస్తున్నాము

ఇలా పైన చెప్పిన శరీరస్థ ప్రాణమును శిరస్సులోని రుద్రగ్రంధినీ — **సహస్రార చక్రముక్రింద** ఉండు **'సోమకళ'** లేక **అమృతగ్రంధినీ** యోగ శాస్త్రంలోని **ఖేచరీముద్ర, లంబికాముద్ర, షణ్ముఖీముద్రల**ద్వారా సాధించి, పై దవడలోని అంగుటినుండి తీయగా స్రవించే **మధురమైన అమృతాన్ని** ఆస్వాదించడమే అమృతసిద్ది అనబడే **"యోగసిద్ధి"**!

దీనివలన శరీరము **మృత్యువును జయించును!** అనగా అన్నపానములు లేకుండా అనేక సంవత్సరాలు జీవించవచ్చు!

అంతేకాదు — **ఊపిరికూడా** పీల్చకుండాకూడా భూసమాధిలోవుండే యోగులు జీవించివుండటానికి ఈ **మృత్యుంజయ సిద్ధియే** కారణము!!

మనకాలంలో ఇలాంటివాడు ముమ్మిడివరం బాలయోగి, శివబాల యోగి, **అక్కల్‌కోట మహారాజు,** హాజీ వారిస్ ఆలీషా, **షిరిడీ సాయి, కాలేమస్తాన్** వంటి సద్గురువులు శరీరంలోనే ఈ మృత్యుంజయత్వాన్ని సిద్దింపచేసుకొని వారి అవయవాలు ఖండఖండ ములుగా విడిపోయినా **'ఖండయోగం'**తో జీవించివుండగలిగారు

ఈ రహస్యమునే **మహన్యాస పూర్వక రుద్రాభిషేక** మంత్రాలలో వేదము మనకు తెలుపుతున్నది' అన్న రహస్యాన్ని గ్రహిస్తే చాలు!

కేవలం బండరాయిపై నీళ్ళుపోసి రుద్రాభిషేకమనుకునే మూర్ఖత్వము నుండి మనలను జీవాత్మస్వరూపుడైన ఆ శివాత్మయే రక్షించును గాక!

**"తన్మేమన శ్శివ సంకల్పమస్తు"**

ఇట్టి నా మనస్సే శివసంకల్పమగు గాక!

శుభమస్తు



9

# మహా శివరాత్రినాడు చేయవలసిన విధులు

సంక్రాంతి పండుగ తరువాత వచ్చే పండుగలలో ముఖ్యమైనది, **మహాశివరాత్రి!** ఇది, దేశమంతా జరుపుకుంటారు

**మహాశివరాత్రి** — శివునకు ప్రధానమైన పర్వదినం। దీనిలోని విశేష మేమంటే అన్ని పండుగలు పగటిపూట జరుపుకుంటే ఈ పండుగలో ప్రధానభాగం **రాత్రిపూట జరుపుకుంటాము!** ఈ పండుగకు ముఖ్యమైన విధులు 1) పగలంతా ఉపవాసం చేయడం, 2) రాత్రి జాగారం చేయడమూను। ఈ ఉపవాసం జాగారంతోపాటు **బిల్వదళాలతో** శివుని పూజించటము, **"శివాభిషేకం"** (రుద్రాభిషేకం) చేయటం ముఖ్యమైనవి రాత్రిపూట సాధన జరుపవలసిన ప్రధానమైన పండుగ కాబట్టి దీనికి 'శివ-రాత్రి' (శివునియొక్క రాత్రి) అని పేరువచ్చింది

## శివరాత్రి నిర్ణయం

ఈ పండుగ ఎప్పుడు చేసుకోవాలి? అనే విషయంలో **ధర్మసింధువు** వంటి శాస్త్రగ్రంధాలు కొన్ని విశేషాలను తెలుపుతున్నాయి!

మాఘమాసంలో వచ్చే బహుళపక్ష చతుర్ధశినాడు — అనగా అమావాస్యకు ముందు వచ్చే కృష్ణ చతుర్ధశినాడే **'శివరాత్రి'**గా జరుపవలెనని శాస్త్రనిర్ణయము

## మాస-శివరాత్రి :

ప్రతినెలలోనూ కూడా బహుళ పక్షంలో అనగా, అమావాస్యముందు వచ్చే చతుర్దశిరోజు శివునికి ప్రీతి అయిన కాలంగా భావించే **'మాస-శివరాత్రి'** అన్నపేరుతో శివపూజలు చేస్తాము ఇది ప్రతినెలా వచ్చే పర్వదినం కాబట్టి దానికి 'మాస-శివరాత్రి' అని పేరు! అలాంటి పన్నెండునెలల్లో, వచ్చే మాసశివరాత్రులలోకీ — ప్రధానమయిన పర్వదినం కాబట్టి, దీనికి **'మహా-శివరాత్రి'** అని పేరు

## శివరాత్రి – మహాపర్వకాలం

శివరాత్రి **పర్వకాల నిర్ణయం** విషయంలో ఒక ముఖ్యమైన శాస్త్ర నియమాన్ని ధర్మశాస్త్రగ్రంధాలు తెలిపివున్నాయి అదేమిటంటే **ఆరోజు బహుళ చతుర్దశీ తిథి అర్ధరాత్రివరకూ** — వుండాలి! అర్ధరాత్రి కనుక బహుళ **చతుర్ధశి లేని పక్షంలో** అంటే **అమావాస్య** గనక **ముందే** ప్రవేశించినట్లయితే — **అంతకు ముందురోజునే** శివరాత్రి పండుగ జరపాలి! ఇలా రెండురోజుల్లో **ఏరోజు చతుర్ధశి వుందో** ఆదినమే **"మహాశివరాత్రి"**గా పరిగణించాలి

దీనికితోడు ఈ మహాశివరాత్రి గనుక **మంగళవారంనాడు** వస్తే అది,

మరీ **అతిప్రశస్తం!** శివరాత్రినాడు పగలు **ఉపవాసం** చేయాలి రాత్రి **జాగరణ** రెండూ చేయాలి!

## శివరాత్రినాడు చేయవలసిన శాస్త్రవిధులు

స్నాన సంధ్యాదికములు పూర్తిచేసుకుని నిత్యపూజ, జపం, అయిన తరువాత, **మహా-సంకల్పం** చెప్పి

**'శివరాత్రి వ్రతం కరిష్యే!**
**తన్మహాఫలం నిర్విఘ్నమస్తు**
**త్వత్, ప్రసాదాత్ జగత్పతే'**

అని మహాదేవుడయిన శివుని మనసా భావించి ఆత్మతో ధ్యానించి సంకల్పంచేసి చతుర్దశీ తిథి అంతా నిరాహారుడై వుండి ఉపవాసం చేయాలి ఉపదేశం వున్నవారు **"శివపంచాక్షరీ"** మంత్రమును అంగన్యాస, కరన్యాసము లతో అనుసంధించి సహస్రం (వెయ్యి)కి తక్కువలేకుండా జపించాలి! వెయ్యికిపైన ఎంతైనా శివపంచాక్షరీ మంత్రం జపించవచ్చును

**"ఓం నమశ్శివాయ"**

అను మంత్రమునే **శివపంచాక్షరీ** మంత్రమంటారు ఈ మంత్రం యథాశక్తి జపించిన తర్వాత మరేడు దళం గ్రహించి పాలతో కలిపిన తీర్థంతో శివలింగంపై తర్పణంగా విడిచిపెట్టాలి ఇలాగ దినమంతా శివపూజతోనూ ధ్యానంతోనూ శక్తి కలిగినవారు **రుద్రాభిషేకంతోనూ,** గడపవలెను ఈ రుద్రాభిషేకము శక్తి కలిగినవారు **మహాన్యాస** పూర్వకముగాకాని. లేక **లఘున్యాస** పూర్వకంగాకాని చేయవచ్చు

శివలింగము స్పటికంతో చేసినదిగాని లేదా నర్మదానదిలో దొరికిన **బాణం**తోచేసిన 'బాణలింగం' గాని లేదా మట్టితోచేసిన **పార్థివ-లింగము** కాని

ఏర్పాటుచేసి దానిపై మహాదేవుడయిన శివుని ధ్యాన ఆవాహనాది, షోడశోప చారములు చేసి **మహారుద్రముతో పదకొండుసార్లు** అభిషేకము చేయవలెను

గంగాజలంతోకాని, కేవలం అభిమంత్రించిన నీళ్ళతోగాని, రుద్రాభిషేకము చేయవచ్చును

## రుద్రాభిషేక విధానం

ఈ రుద్రాభిషేకం చేయునపుడు లింగముపై మారేడు దళములుంచి ఒక్కొక్క కలశంలోని నీళ్ళతో **కలశపూజ** చేసి ప్రతి కలశమునందూ శివ పంచాక్షరితో అభిమంత్రించి ఆవిధముగా **108-కలశములూ మంత్రపూరితము చేసి సిద్ధముచేసుకొని — అప్పుడు రుద్రాభిషేకము ప్రారంభించాలి**

అభిషేకము పూర్తి అయ్యేసరికి కలశములలో అభిమంత్రించిన తీర్థము **సరిగ్గా సరిపోవునట్లు** అనగా — తర్వాత నీళ్లు తక్కువైతే కలుపుకోకుండా చేయవలెను అట్లు చేసిన రుద్రాభిషేక ఫలితము పూర్తిగా కలుగును

## రుద్రాభిషేకంలో దోషాలు

అట్లుకాక చాలామంది బిందెలతో పంపునీటినిగాని, నూతి నీటినిగాని తెచ్చి, అట్లే అభిషేకంగా రుద్రమంత్రం చెపుతూ బిందెలతో నీళ్ళు శివ లింగంపై పోయుటయేకదా? అనుకుంటారు!

అట్లయితే తడవ తడవకీ బిందె ఎత్తి, పోయుట శ్రమగదా? ఒకేసారి **శివలింగమునే పంపుకిందపెట్టి** ఆనీరు పడుతున్నంతసేపూ **మహారుద్రమును ఏల చదువరాదు? పని త్వరగా జరుగునుకదా?"** — అనేప్రశ్నను మాయింటికి రుద్రాభిషేకము చేయడానికి వచ్చిన పూజారిగారిని నేను ఒకసారి, అడిగితిని దానికి ఆయన సరియైన సమాధానము చెప్పలేక **'అట్లు పంపుకిందపెట్టిన**

**అపచారము!** బిందెలతోనే విడివిడిగా అభిషేకము చేయాలి' అన్నాడు కాని నేను ఊరుకొనలేదు 'ఇందులో భేదమేమి? శాస్త్ర నిషిద్ధము ఏమైనా కలదా?' అంటిని 'అట్లేమీ లేదుకాని కలశములతోనే అభిషేకము చేయుట ఆచారము' అనెను

అప్పుడు నేనిట్లంటిని పంపునీటిని కాని, నూతినీటిని కాని, **ఏనీరైననూ సరే, తెచ్చినది తెచ్చినట్లు అభిషేకము చేయరాదు! ఇది శాస్త్రవిరుద్ధము!!** ఎందుకనగా నీటియందు విషము **ఉండును,** అని **వేదప్రమాణము!** ఈ విషము అంట్లేవుంచి అభిషేకం చేసిన నిష్ఫలము కాబట్టి కలశములలో నింపిన జలమును ముందుగా **'నిర్విషము'** చేయవలెను అట్లు నిర్విషము చేయుటకు **'తార్క్ష్యముద్ర'** లేక గరుడముద్రను చేతితోపట్టి నీటిపైఉంచి, **విష హర మంత్రములతో** లేక **'మృత్యుంజయ' బీజాక్షరములతో** అభిమంత్రించి ఆపైన **'అమృతముద్ర'**ను పట్టి **'అమృత బీజాక్షరము'** నుచ్చరించి, జలమును **"అమృతీకరణము"** చేయవలెను

అట్లు అమృతీకరణము చేయబడిన జలమునే శివాభిషేకము చేయుటకు — పైవిధముగా నిర్విషీకరణము చేయలేదు గనుక — వీలు పడదు! ఇదియే శాస్త్ర విహితమైనది, చాలామంచిది **ఇది రుద్రాభిషేకము యావజ్జీవం చేయుచుండువారికి** కూడా **తెలియదు!** అందువల్ల రుద్రాభిషేక ఫలము వీరికి కలుగుటలేదు

## రుద్రాభిషేక ఫలము

పై చెప్పినవిధంగా రుద్రాభిషేకము చేయువారి హస్తము **అమృతీకరణము** పొందును అతడు **ముట్టుకున్న** ప్రతివస్తువునకూ **అమృతత్వసిద్ధి** కలిగించును

దీనికి **నిదర్శనమేమనగా అతని చేతితో తాకినవారికి,** రోగములన్నియూ (మందు లేకయే) **పోవును!** దీనికి రుద్రాభిషేక మంత్రములలోనే 'శివా **విశ్వాయ భేషజే**' దేశములోని అన్నిరోగములకూ **శివుడే వైద్యము** అన్నమంత్రము, **అప్పుడే సిద్ధించును.** కాని నేడు **ఇట్లు సిద్ధించుటలేదు** దానికి కారణము **జలము నిర్విషము చేయకయే అభిషేకించుచున్నారు.** అమృతీకరణము చేసిననే **మృత్యువును** సహితము జయించవచ్చును ఇట్టి రహస్యములు యోగియైన సద్గురువు నుండియే, తెలియవలెను

## నమక–చమకములు

ఈ రుద్రాభిషేకమునకు '**నమక-చమకము**' లతోనే సామాన్యముగా అభిషేకము చేయుదురు. అట్లుగాక '**మన్యుసూక్తం**' తోనూ, మృత్యుంజయ మంత్రసహితంగా గాని పాశుపత బీజాక్షరసహితంగా కాని, రుద్రాభిషేకము చేయవచ్చును దీనికి **పాశుపత, మన్యుసూక్త మంత్రాలు ఉపదేశంగా పొందాలి!**

వీని, అంగన్యాస కరన్యాసములు ధ్యాస, అవాహనములు మూల మంత్రములు తెలియవలెను దీనికి **నల్లజీడిగింజల చెట్లకర్రలు సమిధలుగా చేసి హోమం చేయవలెను.** ఈవిధమైన కల్పం **ఒకసారి 48 రోజుల మండల కాలం చేయగలిగితిని!** దీని ఫలితం **అమోఘం!** మన్యుసూక్తమునకు, '**బ్రహ్మాస్త్రము**' అని పేరుగలదు దాని పూర్తి పాఠమును దీనిలో విడిగా ఇచ్చివున్నాను చూడనగును

అట్లే **సుబ్రమణ్యా మంత్రంతోగాని, శరవణభవ** మంత్రంతోగాని — ధ్యానముచేసి అభిమంత్రించి రుద్రాభిషేకం చేయవచ్చును దీనివలన **శత్రు** రోగముల నిర్మూలన జరుగును! ఇందు **దినమందు** చేయు కలశాభిషేకం **రాత్రి చేయు** సంకల్పమూ వేరుగా నున్నది

శివునియొక్క వివిధ మూర్తులయిన **అఘోర, తత్పురుష మన్యు, శివ** మూర్తులలో ఏదైనా మూర్తిని ముఖ్యముగా **ఆధారం చేసుకుని** రుద్రాభిషేకం **చేయవచ్చు.** ఒక్కొక్క దాని **ఫలితం వేరు వేరుగా ఉంటుంది**

పైవిధంగా రుద్రాభిషేకంచేసి భస్మముతొ త్రిపుండ్రములు **అడ్డముగా శివలింగమున** నుంచవలెను। తర్వాత చందనంతోనూ, ఆపైన కుంకుమతోనూ **గుండ్రంగా** బొట్టునుంచవలెను

ఆనాడు **సాయంకాలం నల్ల నువ్వుల** పిండితో నలుగు పెట్టుకొని స్నానం చేసి విభూతి త్రిపుండ్రములు, రుద్రాక్షలు ధరించి **తూర్పు**ముఖంగా కూర్చుని సంకల్పంచేసి ఒక్కొక్క **జామునకు** విడివిడిగా పూజ చేయవలెను

అట్లు **నాలుగు జాములయందును నాలుగుసార్లు** శివపూజచేసి **నాలుగు సార్లు** నైవేద్యం, కర్పూరహారతి ఇవ్వవలెను

ఈ శివపూజకు **శివపంచాక్షరి** మంత్రము, **న్యాసము,** జపము చేసి **అనుసంధించి** పూజించవలెను

## గురు–పరంపర

ఈ శివపంచాక్షరీ మహామంత్రమునకు **వామదేవుడు** ఋషి। అనుష్టుప్ చందస్సు। సదాశివుడు ఆరాధ్యదేవత, తత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశానాదులైన **అష్టమూర్తియైన** శివుని మూర్తులను — ఆవాహన చేసి న్యాసము చేయవలెను

ఈ క్రిందచెప్పబడిన విధంగా న్యాసంచేసి ప్రాణప్రతిష్టాపన, చేసి ఆవాహన, చేసి రుద్రముతో **పంచామృతస్నానం** ఆతర్వాత శుద్ధోదకంచేత **పదకొండు ఆవృత్తులు** 'రుద్రాభిషేకమును', చేయించి — ఆతరువాత **పురుష సూక్తముతో,** చందన, కుంకుమ, కర్పూరములు కలిపిన తీర్థజలంతొ

దీనికి **నిదర్శనమేమనగా అతని చేతితో తాకినవారికి,** రోగములన్నియూ (మందు లేకయే) **పోవును!** దీనికి రుద్రాభిషేక మంత్రములలోనే 'శివా **విశ్వాయ భేషజే**' దేశములోని అన్నిరోగములకూ **శివుడే వైద్యము** అన్నమంత్రము, **అప్పుడే సిద్ధించును.** కాని నేడు **ఇట్లు సిద్ధించుటలేదు** దానికి కారణము **జలము నిర్విషము చేయకయే అభిషేకించుచున్నారు.** అమృతీకరణము చేసిననే **మృత్యువును** సహితము జయించవచ్చును ఇట్టి రహస్యములు యోగియైన సద్గురువు నుండియే, తెలియవలెను

## నమక–చమకములు

ఈ రుద్రాభిషేకమునకు **'నమక-చమకము'** లతోనే సామాన్యముగా అభిషేకము చేయుదురు. అట్లుగాక **'మన్యుసూక్తం'** తోనూ, మృత్యుంజయ మంత్రసహితంగా గాని పాశుపత బీజాక్షరసహితంగా కాని, రుద్రాభిషేకము చేయవచ్చును దీనికి **పాశుపత, మన్యుసూక్త మంత్రాలు ఉపదేశంగా పొందాలి!**

వీని, అంగన్యాస కరన్యాసములు ధ్యాస, అవాహనములు మూల మంత్రములు తెలియవలెను దీనికి **నల్లజీడిగింజల చెట్లకర్రలు సమిధలుగా చేసి హోమం చేయవలెను.** ఈవిధమైన **కల్పం ఒకసారి 48 రోజుల మండల కాలం చేయగలిగితిని!** దీని ఫలితం **అమోఘం!** మన్యుసూక్తమునకు, **'బ్రహ్మాస్త్రము'** అని పేరుగలదు దాని పూర్తి పాఠమును దీనిలో విడిగా ఇచ్చివున్నాను చూడనగును

అట్లే **సుబ్రమణ్య మంత్రంతోగాని, శరవణభవ** మంత్రంతోగాని — ధ్యానముచేసి అభిమంత్రించి రుద్రాభిషేకం చేయవచ్చును దీనివలన **శత్రు** రోగముల నిర్మూలన జరుగును! ఇందు **దినమందు** చేయు కలశాభిషేకం **రాత్రి చేయు** సంకల్పమూ వేరుగా నున్నది

(10)

# రుద్రాక్ష - మహిమ-I

సాధారణంగా శివాలయాలలోనూ శివపూజచేసేవారి మెడలోనూ మనకి రుద్రాక్షలు కనిపిస్తాయి కీర్తిశేషులైన పరమాచార్యులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి **జామపండంత** రుద్రాక్షను తలపై ధరించేవారు!

ఒక్కసారి నేను వారిని శ్రీశైలంలో దర్శించినపుడు **నిమ్మకాయకంటే** పెద్ద రుద్రాక్షలు మెడలో ధర్శించి దర్శనమిచ్చారు! అనేక రకాల రంగుల లోనూ సైజులలోనూ రుద్రాక్షలు మనకి ఇంకా కనిపిస్తాయి!

నేను అమెరికాలో "ప్రపంచ **పార్లమెంటు మహాసభ**"లలో (World Parliament of Religions 1993) ప్రసంగించే నిమిత్తం వెళ్ళినపుడు అక్కడ **క్యాలిఫోర్నియా** (California) వద్ద ఒకపెద్ద **రుద్రాక్షచెట్ల అరణ్యం** చూసి పరమా నంద భరితుడనైనాను! బంగారు నీరెండలో సముద్రపు తీరానికి సమీపంలో ఈ రుద్రాక్షచెట్ల అడవి కన్నులకింపుగా ఎదిగి వున్నది! అక్కడే ఒక తెల్లవాడు అమెరికన్ యూరోపియన్‌జాతి యోగి తెల్లటి ముగ్గుబుట్ట వంటి జుట్టుముడీ,

దీనికి **నిదర్శనమేమనగా అతని చేతితో తాకినవారికి**, రోగములన్నియూ (మందు లేకయే) **పోవును!** దీనికి రుద్రాభిషేక మంత్రములలోనే 'శివా **విశ్వాయ భేషజే**' దేశములోని అన్నిరోగములకూ **శివుడే వైద్యము** అన్నమంత్రము, **అప్పుడే సిద్ధించును**. కాని నేడు **ఇట్లు సిద్ధించుటలేదు** దానికి కారణము **జలము నిర్విషము చేయకయే అభిషేకించుచున్నారు**. అమృతీకరణము చేసిననే **మృత్యువును** సహితము జయించవచ్చును ఇట్టి రహస్యములు యోగియైన సద్గురువు నుండియే, తెలియవలెను

## నమక–చమకములు

ఈ రుద్రాభిషేకమునకు '**నమక-చమకము**' లతోనే సామాన్యముగా అభిషేకము చేయుదురు. అట్లుగాక '**మన్యుసూక్తం**' తోనూ, మృత్యుంజయ మంత్రసహితంగా గాని పాశుపత బీజాక్షరసహితంగా కాని, రుద్రాభిషేకము చేయవచ్చును దీనికి **పాశుపత, మన్యుసూక్త మంత్రాలు ఉపదేశంగా పొందాలి!**

వీని, అంగన్యాస కరన్యాసములు ధ్యాస, అవాహనములు మూల మంత్రములు తెలియవలెను దీనికి **నల్లజీడిగింజల చెట్లకర్రలు సమిధలుగా చేసి హోమం చేయవలెను**. ఈవిధమైన **కల్పం ఒకసారి 48 రోజుల మండల కాలం చేయగలిగితిని!** దీని ఫలితం **అమోఘం!** మన్యుసూక్తమునకు, '**బ్రహ్మాస్త్రము**' అని పేరుగలదు దాని పూర్తి పారమును దీనిలో విడిగా ఇచ్చివున్నాను చూడనగును

అట్లే **సుబ్రమణ్య మంత్రంతోగాని, శరవణభవ** మంత్రంతోగాని — ధ్యానముచేసి అభిమంత్రించి రుద్రాభిషేకం చేయవచ్చును దీనివలన **శత్రు** రోగముల నిర్మూలన జరుగును! ఇందు **దినమందు** చేయు కలశాభిషేకం **రాత్రి చేయు** సంకల్పమూ వేరుగా నున్నది

## వైద్యంలో – రుద్రాక్ష ప్రభావం :

**ఆయుర్వేదంలో** రుద్రాక్షలను కషాయంగానూ, చూర్ణంచేసి మందు గానూ, ఇంకా అనేక విధాలుగా ఆరోగ్యానికై వాడతారు! రుద్రాక్షలగురించి పురాణాలలో, శాస్త్రాలలో ఎన్నో అద్భుతవిషయాలు చెప్పబడివున్నాయి!

రుద్రాక్షలు నాలుగు వర్ణములు — 1) **బ్రహ్మజాతి**, 2) **క్షత్రజాతి**, 3) **వైశ్యజాతి**, 4) **శూద్రజాతి**! — తెల్లని రుద్రాక్షలు బ్రహ్మజాతివి దొరకుట చాలా అరుదు! ఎర్రనివి తేనెరంగు రుద్రాక్షలు క్షత్రజాతివి! చింతగింజ రంగువుండే రుద్రాక్షలు వైశ్యజాతివి! నల్లటి రుద్రాక్షలు శూద్రజాతివి — అని **శివపురాణం**, స్కాందపురాణం రుద్రాక్షోపనిషత్తులలో చెప్పబడినాయి రుద్రాక్షల ఉత్పత్తి గురించి తెలిపే గ్రంధాలు -

**1) రుద్రాక్షోపనిషత్తు**
**2) రుద్ర జాబాల్యుపనిషత్తు**
**3) శివపురాణం**
**4) స్కాందపురాణం**
**5) పద్మపురాణములలో వర్ణించబడివున్నాయి!**

వృక్షశాస్త్రంలో బాటనీ (Botany) సైన్సుప్రకారం **"ఎలయోకార్పస్"** అనబడే కుటుంబానికి చెందినవి రుద్రాక్షలు! ఇవి ఆసియాలోనూ, తూర్పు దక్షిణ ఆసియాలోనూ, ముఖ్యంగా మలేషియా, ఆస్ట్రేలియా, ఫసిఫిక్ ద్వీపాలలో పెరుగుతుంది! ఈశాన్యంలో బర్మానుంచి నేపాల్‌వరకూ ఈ రుద్రాక్ష చెట్లు ఎత్తుగా సహజంగానే పెరుగుతాయి! రుద్రాక్ష చెట్లు 60 అడుగుల ఎత్తువరకూ కొన్ని 90 అడుగుల ఎత్తువరకూ కూడా పెరుగుతాయి!

రుద్రాక్ష తెల్లని పూలుపూస్తుంది! పండుటాకుల కణుపులనుంచి

పువ్వులు పూస్తాయి। కాని, **ప్రతీ ఏటా ఇలా పువ్వులు పుయ్యవు!** ఒక్కోసారి కొన్నేళ్ళవరకూకూడా పూయనే పుయ్యవు।

జ్యోతిష, మంత్రశాస్త్రజ్ఞుల సిద్ధాంతం ప్రకారం — **బృహస్పతి, అంగారకుల, శని గురులు** — అనుకూలదృష్టితో వున్నప్పుడే రుద్రాక్షలుపుట్టి పుష్పించి ఫలాలవుతాయి అంటారు। అది నిజమే కావచ్చు।

## రుద్రాక్ష–పండ్లు :

రుద్రాక్షపండ్లు నీలంరంగు, ఎరుపు కలిసిన వైలట్ కలర్‌లో వుంటాయి! పచ్చని పండుటాకుల కణుపులనుండి పువ్వులూ రుద్రాక్షలూ మొలుస్తాయి।

ఈ రుద్రాక్షచెట్లు మామిడిచెట్లలాగా ఎత్తుగా గుబురుగా పెరిగి ఎక్కువ విశాలమైన స్థలంలో వ్యాపిస్తాయి। వీటికి శరదృతువులో అనగా నవరాత్రుల్లో చిన్నకాయలు గంగరేగిపండు సైజునుంచి జామపండు అంతవరకూ గట్టి బెరడుతో మందంగా వున్న పండ్లు పడతాయి। అక్కడి యోగులు రుద్రాక్ష పండ్లను తింటారు। ఆ పండుకు లోపల గింజలకు రేగిపండు గింజలవలే చారలు, ముండ్లు వుంటాయి। వీటినే **రుద్రాక్షి ముఖాలు** అంటారు।

సామాన్యంగా రుద్రాక్షకు ఐదుముఖాలు, ఆరుముఖాలు, పదకొండు ముఖాలనుండి, 14 ముఖాలు, 16 ముఖాలవరకూ కూడా వుంటాయి।

రుద్రాక్ష సైజుకూడా మిరియంగింజ సైజునుండి, పెద్దనిమ్మకాయ అంత సైజువరకూ వుంటుంది। రేగుపండు సైజులోవుండే రుద్రాక్ష సుఖ సౌఖ్యాల నిస్తుంది। ఉసిరికాయంత సైజులోవుండే రుద్రాక్ష అనేక ప్రమాదాలను తొలగిస్తుంది। ఎండు శనగలంత ఆకారంలోవుండే రుద్రాక్షలు అనేక కోరికలను సిద్ధింపచేస్తాయి। నిమ్మకాయనుండి పెద్ద మర్రికాయసైజు వరకూ రుద్రాక్షలు కూడా చాలా అరుదుగా దొర్రుకుతాయి।

ఈరోజుల్లో నకిలీ రుద్రాక్షలెన్నో మార్కెట్లోకి వస్తున్నాయి! అసలు మంచి రుద్రాక్షలేవో తెలుసుకోవడానికి కొన్ని పరీక్షలున్నాయి! పాలలోగాని నీళ్ళలోగాని రుద్రాక్షలువేస్తే మునుగుతాయి! బరువులేని రుద్రాక్షలు మరీ లేతవీ పనికిరావు! రుద్రాక్షను రాగి ఉద్ధరిణెకింద నిలిపి అడుగున రాగి హరివాణంగాని పంచపాత్రగాని పెడితే సాలగ్రామంలాగా — దానంతటఅదే **ప్రదక్షిణంగా తిరుగుతుంది!**

రుద్రాక్షగనక **అప్రదక్షిణంగా తిరిగితే** అది దారిద్ర్యం కలిగించును! అది, సన్యాసులకు పనికివచ్చును! గృహస్థులు ధరిస్తే భార్యవినాశం, సంసార చ్ఛేదనం, సన్యాసం కలుగును!

స్కాందపురాణంలోను, **రుద్రాక్షోపనిషత్తులో** — "రుద్రాక్షమహిమ గురించి ఎంతచెప్పినా తృప్తికలగదు నారదా" — అని శ్రీమన్నారాయణుడు నారద మహర్షితో చెప్పినాడు! రుద్రాక్షలు ధరించిన జపధ్యాన పరాయణులను ధిక్కరించినా, దూషించినా, వారిపై కోపించినా భ్రష్టులగుదురు! కష్టములు కలుగును! అలానే రుద్రాక్షను దానమిచ్చినా గోధాన, అన్నదాన ఫలితం కలిగి రుద్రలోకంలో శివసాన్నిధ్యమున వారి ఆత్మ సంచరించును! ఏకముఖ రుద్రాక్ష అనంతకోటి పుణ్యఫలము కలది! దాని దర్శనముననే అనేక పాపములు తొలగును! శరీరంపై ధరిస్తే బ్రహ్మహత్యాది మహాపాతకములు కూడా నశించును!

## రుద్ర జాబాల్యుపనిషత్తులోని గాథ :

పూర్వయుగములలో **భుషుండి** అనే ఋషి శివునిగూర్చి తపస్సుచేసి కాలాగ్ని రుద్రుని దర్శించి రుద్రాక్షమహిమలగురించి ఉపదేశించమని అడిగాడు! ఆయన చెప్పిన విశేషాలే "**రుద్రజాబాల్యుపనిషత్తు**"లో ఈవిధంగా వర్ణించబడినది

**"ఓమ్ అథహైనం కాలాగ్నిరుద్రం భుసుండః పప్రచ్ఛ కథం రుద్రాక్షోత్పత్తిః స్తద్ధారణాత్కింఫలమితి**
**భగవాన్కాలాగ్ని రుద్రః తంహోవాచ త్రిపుర వధార్థ మహం నిమిలితాక్షో స్తేభ్యో జలబిందవో భూమౌ పతితాస్తే రుద్రాక్షా జాతా**
**స్సర్వా గ్రహార్థాయతేషాం నామోచ్ఛారణ మాత్రేణ దశ గోప్రదాన సుక్రుత ఫలం దర్శన స్పర్శనాభ్యాం ద్విగుణఫలమత ఊర్ధ్వం వక్తుం నశోక్నోమి"**

దీని అర్థము ఇలావుంది "రుద్రాక్ష"పేరు స్మరించితేనే దశ గోదాన పుణ్యం కలుగుతుంది! రుద్రాక్షను తాకినా, ధరించినా లభించే పుణ్యం ఇంతని చెప్పడం నాకు అసాధ్యం!

"ఓ భుసుండుడా! ఒకానొకప్పుడు నేను వెయ్యి దివ్యవర్షములు తపస్సు చేసితిని! అప్పుడు కలిగిన ఆనందభాష్పములే జలబిందువులుగా మారి నేలపై పడినవి! ఆ నీటిబిందువులనుండియే మహత్తరమైన రుద్రాక్ష చెట్లు మొలిచినవి' అందుకే దానిని '**రుద్ర+అక్ష**' = రుద్రుని కన్నులనుండి పుట్టినవని పేరు కలిగినది!"

## రుద్రాక్షలలో – చాతుర్వర్ణములు :

ఇంకనూ ఈ **కాలాగ్ని రుద్రుడు** చేసిన ఉపదేశం ప్రకారం బ్రాహ్మణులు తెల్లని రుద్రాక్షలను, క్షత్రియులు ఎర్రని రంగుగల రుద్రాక్షలను, వైశ్యులు లేతపసుపురంగు రుద్రాక్షలను శూద్రులు నల్లనిరంగు రుద్రాక్షలను ధరించితే అనుకూలమగు మంచిఫలములు కలిగి పాపములు నశించి సమస్త కోరికలు నెరవేరును!

ఇంకనూ పురుగు తొలచినవి ముక్కలుగా బద్దలుగానైనవి, రంధ్రములు కలిగి భిన్నములైనవి ధరించరాదు! రుద్రాక్షచెట్టుమీద నున్నప్పుడే చిల్లు ఏర్పడితే అది ఉత్తమ రుద్రాక్ష!

రుద్రాక్షను పట్టుదారంతోకాని, బంగారుతీగె, వెండితీగెతోగాని లేక రాగితీగలతోకాని మాలగా చేసి ముత్యాలు స్ఫటికాలు, పగడాలు పచ్చలు, శంఖాలు లేదా నవరత్నాలతో కలిగి ధరించితే — భోగములు కలుగును! జపం వెయ్యిరెట్లు, లక్షరెట్లు కోటిరెట్లు ఫలితమిచ్చును!

ఈ రుద్రాక్షను శిరస్సుచుట్టూ కిరీటంలాగ కూడా ధరించవచ్చును! చెవులకు కుండలములుగానూ, చేతులకు కంకణములుగానూ, కంఠంలో మాలగానుకూడ ధరించవచ్చును! కంఠంలో 36 చేతులకు 16, మణికట్టుకు 12, శరీర మంతనూ 500 రుద్రాక్షలు పెద్దమాలగా ధరించవచ్చు!

రుద్రాక్ష ధారణాభేదంవల్ల — శిరస్సుపై ధరిస్తే **ఈశానమంత్రం** తోనూ, కంఠంలో ధరించితే **తత్పురుష** నామంతోనూ, రొమ్ముపై **అఘోర** నామం తోనూ, హృదయంపై అఘోర బీజాక్షర సహిత **పాశుపత** మంత్రంతోనూ జపించి అభిమంత్రంచేసి ధరించవలెను! సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రాల చేత రుద్రాక్షను ఉదరమునందు ధరించవలెను!

రుద్రాక్ష శరీరమున ధరించివుండగా అస్ఖలిత బ్రహ్మచారిగా వుండ వలెను! లేకున్న తలపై అణచును లేదా చేసిన సమస్త పనులూ వ్యతిరేక మగును ఆకస్మిక మృత్యుభయమును కలిగించును!

## నిషేధము :

రుద్రాక్షలు ధరించివుండగా, లేదా రుద్రాక్షలను ధరించినవారు

1) మద్యము త్రాగుట
2) మాంసము భుజించుట లేక వాసన చూసుట లేదా మాంసాహారులతో స్పర్శించుట చేయరాదు!

3) గృహస్తులు రాత్రివేళ గృహస్తధర్మంలో వుండేసమయంలో రుద్రాక్ష మాలను తీసివేసి పూజాస్థానంలో వుంచి మరునాడు స్నానా నంతరం **సహస్ర గాయత్రి**తో సంప్రోక్షణ మహాన్యాసంచేసి రుద్రాక్షను కంఠమునందు ధరించవలెను!

అని, ఈవిధంగా భగవానుడైన కాలాగ్నిరుద్రుడు భుషుండి మహర్షికి ఉపదేశించాడు! — అని **రుద్రాక్షోపనిషత్తు**లోనూ శివపురాణంలోనూ, స్కాంద పురాణం, **ఆది పురాణములలో**నూ రుద్రాక్షలయొక్క ముఖాలూ వాటి ఫలితాలు వివరంగా వర్ణించబడివున్నాయి!

## విదేశీయుల పరిశోధన :

రుద్రాక్షల మహాత్యంగురించి యూరోపియన్ ఫ్రెంచ్, జర్మన్ దేశస్థులు విశేషపరిశోధనలు చేశారు! క్రైస్తవుడైన **శివాయ సుబ్రహ్మణ్యస్వామి** గురించి పైన వివరించాను! అలాగే — **పాల్ హ్యూమ్** (Paul Hume) అనే విదేశీయుడు 20 ఏళ్ళపాటు రుద్రాక్షలపై పరిశోధనలుచేసి వాటి ఫలితాలన్నీ ఒక గ్రంధంగా రాశాడు! రుద్రాక్షను ధరించితే ప్రయత్నించిన పనులు — అసంభవం అనుకున్నవి ఎన్నో తేలికగా సంభవమౌతాయని తన అనుభవంతో రచించాడు!

అలానే **జాన్ గ్యారెట్** (John Grret) అనే ఇంకొక విదేశీయ బ్రిటీష్ సైన్యంలో పనిచేసిన లెఫ్టినెంట్ కల్నల్ **కెర్బర్ డ్రోరి** (Lt Col. Kerber Drory) రుద్రాక్షలపై బొటానికల్ (Botanical) పరిశోధనలుచేసి అద్భుత ఫలితాలను రాశాడు!

శృంగేరీ శంకరపీఠాధిపతి శ్రీశ్రీ భారతీ తీర్థస్వామివారు కంచికామకోటి పీఠాధిపతి జగద్గురు శ్రీశ్రీశ్రీ **చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారు** రుద్రాక్షల గురించి తమ ప్రవచనములలో ఎన్నో విశేషాలు తెలిపారు!

## "రుద్రారణ్యము" :

రుద్రాక్షల అరణ్యమును **"రుద్రారణ్యము"** అంటారు! ఇలాంటిది నేపాల్‌లో **పంచక్రోశి** అనే క్షేత్రంలో **జనక్‌పూర్‌ధామ్** అనబడే సీతామాత జన్మస్థలానికి దక్షిణంగా జయనగర్‌కు ఉత్తరంగా జలేశ్వర్ మహదేవుని పుణ్యక్షేత్రంలో వున్నది!

ఇంకా డార్జిలింగ్, కొంకణా, కేరళ రాష్ట్రాలలో ఇండొనేషియా, జావా, మలేషియా, ఆస్ట్రేలియాలలోను, అమెరికాలోని కాలిఫోర్నియాలోనూ రుద్రాక్షల అరణ్యములను పెంచుతున్నారు! నేపాల్‌లోని రుద్రాక్షలలో ఏకముఖ రుద్రాక్షలు విశేషములు! **అక్షమాలోపనిషత్తులోను** శివపురాణాలలో ఇంకా రుద్రాక్షలగురించి అనేక రహస్యాలు చెప్పబడివున్నాయి!

1) రుద్రాక్ష మృత్యువును జయించునట్టిది, సర్వవ్యాప్తక మైనట్టిదియు ప్రణవముతో గూడిన **"అం"**కారము ఈ మొదటి పూసయందు ప్రతిష్టతమై యుండుగాక

2) ఆకర్షణాత్మకమైనట్టిది, సర్వత్ర నిండియుండునట్టిదియు ప్రణవము తో గూడిన **"ఆం'** 'కారము ఈ **రెండవ** పూసయందు ప్రతిష్టితమై నిలుచు గాక

3) పుష్టి (బలము) నిచ్చునది, క్షోభ (వేదన) కలిగించునట్టిదియు ప్రణవముతొ గూడిన **"ఇం"**కారము యీ మూడవ పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

4) వాక్కునకు ప్రసాద గుణమిచ్చునట్టిది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో జేరిన **"ఈం"**కారము యీ నాలుగవ పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

5) అన్ని బలములకాధారమైనట్టిది, సారములందు సారతరమై నట్టిదియు ప్రణవముతో జేరిన "ఊం"కారము ఈ అయిదవ పూసయందు స్థిరమైయుండుగాక

6) ఉచ్చాటనమున కాధారమైనట్టిది, దుస్సహ మైనట్టిదియు ప్రణవముతో గూడిన "ఊం"కారము యీ ఆరవపూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండు గాక

7) సంక్షోభమును కలిగించునట్టిది, సంచలమైనట్టిదియు, ప్రణవముతో కూడిన "ఋం"కారము యీ యేడవ పూసయందు ప్రతిష్ఠితమై నిలిచి యుండుగాక

8) సమ్మోహన (మోహము) కరమైనట్టిది, ఉజ్వల (మహాతేజము) మైనట్టిదియు ప్రణవముతో గూడిన "ౠం"కారము యీ యెనిమిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

9) విద్వేషణకరమై (ద్వేషమును కలిగించు) నట్టిది, మోహమును కల్గించునట్టిదియు, ప్రణవముతో జేరిన " ం"కారము యీ తొమ్మిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

10) మోహకరమై (మోహమును కలిగించునట్టి) ప్రణవముతో గూడిన " ం"కారము యీ పదియవ పూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండుగాక

11) సర్వము (స్త్రీపురుషాదులను) వశ్యమొనరించినట్టిది, శుద్ధమై నట్టిదియు, ప్రణవముతొ గూడిన "ఏం"కారము ఈ పదునొకండవ పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

12) శుద్ధసత్త్వము (అతి శాంతము, తేజము గలవి) కలది పురుప వశీకరణమైనట్టిదియు, ప్రణవముతో జేరిన "ఐం"కారము యీ పదిరెండవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

13) అఖిల వాఙ్మయమునకు స్వరూప (ఆధార)ముగా కలది నిర్మల మైనట్టిదియు, ప్రణవముతో జేరిన "**ఓం**"కారము యీ **పదమూడవ** పూస యందు ప్రతిష్ఠితమై నిలచియుండుగాక

14) సర్వ వాఙ్మయమును రూపముగా కలిగినట్టిది. వశ్యకరమైనట్టిదియు. ప్రణవముతొ గూడిన "**ఐం**"కారము యీ పదునాలుగవ పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

15) గజాది జంతుజాలమును వశీకరణమొనరించునట్టిదియు, మోహమును పుట్టించునట్టిదియు, ప్రణవముతొ జేరిన "**అం**"కారము ఈ పదునైదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

16) మృత్యువును నశింపుజేయునది, రౌద్రమును కలిగించునట్టిదియు, ప్రణవముతో గూడిన "**ఆం**"కారము యీ పదునాఱవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

**"ఓం కంకార సర్వవిషాహార కల్యాణద సప్తదశేऽక్షే ప్రతితిష్ఠ ఓం ఖంకార సర్వసంక్షోభకర వ్యాపకాష్టాదశేऽక్షే ప్రతితిష్ట ఓం గంకార సర్వ విఘ్నశమన మహత్తర ఏకోనవింశేऽక్షే ప్రతితిష్ఠ. ఓం ఘంకార సౌభాగ్యద స్తంభనకర వింశేऽక్షే ప్రతితిష్ఠ. ఓం ఙంకార సర్వవిషనాశకర ఉగ్ర ఏకవింశేऽక్షే ప్రతితిష్ఠ ఓం చంకార అభిచారఘ్న క్రూర ద్వావింశేऽక్షే ప్రతితిష్ఠ. ఓం ఛంకార భూతనాశకర భీషణ త్రయోవింశేऽక్షే ప్రతితిష్ఠ. ఓం జంకార కృత్యాది నాశకర దుర్ధర్ష చతుర్వింశేऽక్షే ప్రతితిష్ఠ ఓం ఝంకార భూతనాశకర పంచవింశేऽక్షే ప్రతితిష్ఠ ఓం ఞంకార మృత్యుప్రమథన షడ్వింశేऽక్షే ప్రతితిష్ఠ"**

17) అనగా, అర్థము - అన్నివిధములైన విషములను హరించు నట్టిది అన్ని శుభ (కళ్యాణ)ములను చేయునట్టిదియు ప్రణవముతో జేరిన "కం"కారము యీ **పదునేడవ** (17) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

18) అంతటిని సంక్షోభపరచునట్టిది అంతటనూ వ్యాపకమై యుండు నట్టిదీ ప్రణవముతో జేరిన "ఖం"కారము ఈ పదునెనిమిదవ (18) పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

19) సర్వవిఘ్నములను పోగొట్టునట్టిది, మహత్తర (గొప్పదై) నట్టిది ప్రణవముతో గూడిన "గం"కారము యీ పందొమ్మిదవ (19) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

20) సౌభాగ్యమూ (ఐశ్వర్యము), జ్ఞానము ఒసంగునట్టిదీ, స్తంభన మొనరించునట్టిదియుఐన, ప్రణవముతో జేరిన "ఘం"కారము ఈ యిరువదవ (20) పూసలో ప్రతిష్ఠితమైవుండుగాక

21) సర్వవిషములను హరించునట్టిది, ఉగ్రమై (అతిభీషణ) నట్టి "ఙం"కారము ఈ యిరువదొక్కటవ (21) పూసయందు ప్రతిష్ఠితమై నిలిచి యుండుగాక

22) అభిచార (చంపునట్టి ప్రయోగ)ములను నశింపుచేయునట్టిది క్రూర (భయంకర)మైనట్టిదియు, ప్రణవముతో గూడిన "చం" కారము యీ యిరువదిరెండవ (22) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

23) భూతప్రేత (పిశాచముల) బాధలను పోగొట్టునట్టిది, భయంకర మయినట్టిదియు, ప్రణవము గూడిన "ఛం" కారము ఈ ఇరువది మూడవ (23) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

24) పిశాచ ప్రయోగాది కృత్యములను నాశనముకావించునట్టిది, ప్రచండ (మహాభయంకర) మైనట్టిదియు, ప్రణవముతో గూడిన "జం" కారము యీ యిరువదినాలుగవ (24) పూసయందు ప్రతిష్టితమై యుండు గాక

25) భూతప్రేత (పిశాచ) నాశనకరమయినట్టి "ఝం"కారము యీ ఇరువదైదవ (25) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

26) "ఓం టంకార సర్వవ్యాధిహర సుభగ సప్తవింశేఽక్షే ప్రతి తిష్ఠ. ఓం ఠంకార చంద్ర రూప అష్టావింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం డంకార గరుడాత్మక విషఘ్న శోభన ఏకోన త్రింశే ప్రతితిష్ఠ. ఓం ఢంకార సర్వసంపత్ప్రద సుభగ త్రింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం ణంకార సర్వసిద్ధిప్రద మోహాకర ఏకత్రింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం తంకార ధనధాన్యాది సపత్ప్రద ప్రసన్న ద్వాత్రింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం థంకార ధర్మప్రాప్తికర నిర్మల త్రయంస్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం దంకార పుష్టి వృద్ధికర ప్రియదర్శన చతుస్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం ధంకార విషజ్వరఘ్న విపుల పంచత్రింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం నంకార భుక్తిముక్తి ప్రద శాంత షట్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం పంకార విషమిఘ్న నాశన భవ్య సప్తత్రింశేక్షే ప్రతితిష్ఠ ఓం ఫంకార అణిమాది సిద్ధిప్రద జ్యోతి రూపాష్టత్రింశేక్షే ప్రతితిష్ఠ. ఓం బంకార సర్వదోషహర శోభన ఏకోనచత్వారింశే అక్షే ప్రతితిష్ఠ ఓం భంకార భూత శాంతికర భయానక చత్వారింశే క్షే ప్రతితిష్ఠ. ఓం మంకార విద్వేషి మోహన కరా ఏక చత్వారిశే అక్షే ప్రతితిష్ఠ."

27) అనగా — 'సర్వవ్యాధులను నశింపుజేయునట్టిది, శుభము (మేలు, ఉపకారము) చేయునట్టిదియు, ప్రణవముతో గూడిన "టం"కారము ఈ యిరువదియేడవ (27) పూసయందు ప్రతిష్టితమై యుండునుగాక

28) చంద్రునితొ సమానమైన రూపము కలదియు, ప్రణవముతో జేరిన "ఠం"కారము ఈ యిరువది యెనిమిదవ (28) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

29) గరుడాత్మకమై విషమును హరించునట్టిది, శుభ ప్రదమైనట్టిదియూ

ప్రణవముతో జేరిన "**ఢం**"కారము ఈ యిరువది తొమ్మిదవ (29) పూసయందు ప్రతిష్ఠితమైయుండుగాక

30) సర్వసంపదలొసంగునట్టిది, సుభగ (శుభకర) మైనట్టిది ప్రణవముతో జేరిన "**ణం**"కారము ఈ ముప్పదవ (30) పూసయందు ప్రతిష్ఠితమై యుండు గాక

31) సర్వసిద్ధుల నిచ్చునట్టిది, మోహ (అపేక్ష) కర మైనట్టిదియు ప్రణవ ముతో గూడిన "**ణం**"కారము ఈ ముప్పది యొకటవ (31) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

32) ధనధాన్యాది సంపత్ప్రదనట్టిది, ప్రసన్నకర మైనట్టిదియు, ప్రణవముతో జేరిన "**తం**"కారము యీ ముప్పదిరెండవ (32) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

33) ధర్మప్రాప్తకరమైనట్టిది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో గూడిన "**థం**"కారము యీ ముప్పదిమూడవ (33) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

34) పుష్టిని, వృద్ధిని కలిగించునట్టిది, ముఖ్యమైనవారి ప్రియదర్శనము కలిగించునట్టిదియు, ప్రణవముతో గూడినట్టి "**దం**"కారము ఈ ముప్పది నాలుగవ (34) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

35) విషజ్వరములను నశింపజేయునట్టిది, విపుల (విస్తార)మై నట్టిదియు, ప్రణవముతో జేరిన "**ధం**"కారము ఈ ముప్పదియైదవ (35) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

36) భుక్తి ముక్తులను ఉభయ లోకములందును సుఖమును ఒసంగు నట్టిది, శాంతమైనట్టిదియు, ప్రణవముతో గూడియుండిన "**నం**"కారము ఈ ముప్పదియాఱవ (36) పూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండుగాక

37) విషములను, విఘ్నములను హరించునట్టిది భవ్య (మంగళప్రద) మైనట్టిదియు, ప్రణవముతో జేరిన "పం"కారము ఈ ముప్పదిఏడవ (37) పూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండుగాక

38) అణిమాద్యష్టసిద్ధు లొసంగునట్టిది, సిద్ధిప్రదమైనట్టిది జ్యోతిరూప (ప్రణవతేజ) మైనట్టిదియు, ప్రణవముతో గూడినట్టి "ఫం"కారము ఈ ముప్పదియెనిమిదవ (38) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

39) సర్వదోషములను హరించునట్టిది, శుభప్రదమైనట్టిది ప్రణవముతో గూడిన "బం"కారము ఈ ముప్పదితొమ్మిదవ (39) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

40) భూతములను క్షుద్ర భూతములను శాంతింపజేయునట్టిది భయంకరమైనట్టిదియు, ప్రణవముతో జేరిన "భం"కారము ఈ నలుబదవ (40) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

41) ద్వేషించే (శత్రువులను) అపకారులగు వారిని మోహింపజేయు నట్టిది ప్రణవముతో కూడిన "మం"కారము యీ నలుబదొకటవ (41) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

**"ఓం యంకార సర్వవ్యాపక పావన ద్విచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం రంకార దాహకర వికృత త్రిచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం లంకార విశ్వంభర భాసుర చతుశ్చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం వంకార సర్వాప్యాయనకర నిర్మల పంచ చత్వారిశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం శంకార సర్వఫలప్రద పవిత్ర షట్చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం షంకార ధర్మార్థకామద ధవళ సప్తచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం సంకార సర్వకారణ సార్వవర్ణిక అష్టచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం హంకార సర్వవాఙ్మయ నిర్మల ఏకోన పంచదశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం ళంకార సర్వశక్తి**

**ప్రధాన పంచదశేఽక్షే ప్రతితిష్ట. ఓం క్లంకార పరాపరత్వ జ్ఞాపక పరజ్యోతీరూప శిఖామణే ప్రతితిష్ట**

42) అనగా సర్వవ్యాపకత్వము కలిగినట్టిది, పవిత్రమైనట్టిదియు ప్రణవముతో జేరిన "**యం**"కారము యీ నలుబదిరెండవ (42) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

43) దాహక (అగ్ని) శక్తి కలిగినట్టిది, వికృతమైనట్టిది ప్రణవముతో గూడిన "**రం**"కారము ఈ నలుబదిమూడవ (43) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

44) చరాచరవిశ్వమంతటిని భరించునట్టిది ప్రకాశించునట్టిదియు ప్రణవముతో గూడిన "**లం**"కారము యీ నలుబది నాలుగవ (44) పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

45) అన్నిటియందును తృప్తిని కలిగించునట్టినది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో జేరిన "**వం**"కారము యీ నలుబదైదవ (45) పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

46) సర్వమును ఫలప్రద (సుఖ) మొనరించునట్టిది, పవిత్రమై నట్టిదియు, ప్రణవముతో జేరిన "**శం**"కారము యీ నలుబదాఱవ (46) పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

47) ధర్మార్ధకామముల నొసంగునట్టిది ధవళ (శుద్ధమైన తెలుపు) మైనట్టిదియు ప్రణవముతో గూడిన "**షం**"కారము యీ నలుబదేడవ (47) పూస యందు ప్రతిష్ఠితమై వుండుగాక

48) సర్వమునకూ కారణమైనట్టిది, అన్ని వర్ణము (అక్షరము)లకూ సంబంధించినట్టిదియు ప్రణవముతోజేరిన "**సం**"కారము ఈ నలుబదెనిమిదవ (48) పూసయందు ప్రతిష్ఠితమై వుండుగాక

49) సర్వవాఙ్మయ స్వరూపమయినట్టిది నిర్మలమైనట్టిదియు ప్రణవముతో జేరిన "హం"కారము యీ నలుబదితొమ్మిదవ (49) పూస యందు ప్రతిష్ఠితమై యుండుగాక

50) సర్వశక్తుల నొసంగునట్టిది ప్రధాన (అన్నిటికిని) మయినట్టిదియు, ప్రణవముతో గూడిన "శం"కారము ఈ యేబదవ (50) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక — అని ఇట్లు యాభైనాలుగుదాకా — అనగా "అర్ధజపమాల" అనగా 54 × 2 = 108 పూసలమాలలోని 'శివ'మాల ('శక్తి' భీజాలను వొదిలి) ను అభిమంత్రించవలెను



**ప్రధాన పంచదశేఽక్షే ప్రతితిష్ట. ఓం క్షంకార పరాపరత్వ జ్ఞాపక పరజ్యోతీరూప శిఖామణే ప్రతితిష్ట**

42) అనగా సర్వవ్యాపకత్వము కలిగినట్టిది, పవిత్రమైనట్టిదియు ప్రణవముతో జేరిన "**యం**"కారము యీ నలుబదిరెండవ (42) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

43) దాహక (అగ్ని) శక్తి కలిగినట్టిది, వికృతమైనట్టిది ప్రణవముతో గూడిన "**రం**"కారము ఈ నలుబదిమూడవ (43) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

44) చరాచరవిశ్వమంతటిని భరించునట్టిది ప్రకాశించునట్టిదియు ప్రణవముతో గూడిన "**లం**"కారము యీ నలుబది నాలుగవ (44) పూస యందు ప్రతిష్టితమై యుండుగాక

45) అన్నిటియందును తృప్తిని కలిగించునట్టినది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో జేరిన "**వం**"కారము యీ నలుబదైదవ (45) పూసయందు ప్రతిష్టితమై యుండుగాక

46) సర్వమును ఫలప్రద (సుఖ) మొనరించునట్టిది, పవిత్రమై నట్టిదియు, ప్రణవముతో జేరిన "**శం**"కారము యీ నలుబదాఱవ (46) పూస యందు ప్రతిష్టితమై యుండుగాక

47) ధర్మార్థకామముల నొసంగునట్టిది ధవళ (శుద్ధమైన తెలుపు) మైనట్టిదియు ప్రణవముతో గూడిన "**షం**"కారము యీ నలుబదేడవ (47) పూస యందు ప్రతిష్టితమై వుండుగాక

48) సర్వమునకూ కారణమైనట్టిది, అన్ని వర్ణము (అక్షరము)లకూ సంబంధించినట్టిదియు ప్రణవముతోజేరిన "**సం**"కారము ఈ నలుబదెనిమిదవ (48) పూసయందు ప్రతిష్టితమై వుండుగాక

# 11

# రుద్రాక్షల ముఖములు వాటి ఫలితాలు-II

రుద్రాక్షలగురించి మరికొన్ని వివరాలు, విశేషాలూ ఈ అధ్యాయంలో మీకు తెలుపుతాను

## ఏకముఖ రుద్రాక్ష :

ఇది చాలా అరుదు, అలభ్యము! ఏకముఖ రుద్రాక్ష శివస్వరూపం, పరతత్త్వ రూపము! దీనిని ధరించుటవలన సమస్త పాపములూ నశించి శత్రువులపై విజయాలు కలుగును అకస్మాత్తుగా ధనం, సంపద లభించును! ఏకముఖి రుద్రాక్ష — "ఓం హ్రీం క్లీం శ్రీం నమః" అన్నమంత్రంతో జపించి ధరించాలి! ఏకముఖ రుద్రాక్షలలో అనేక రకాలున్నాయి!

## ద్వీముఖి లేక రెండు-ముఖముల రుద్రాక్ష :

రెండు ముఖముల రుద్రాక్ష **అర్ధనారీశ్వర** మూర్తి! దీన్ని సోమవారంనాడు "ఓం శంభవేనమః" అన్న మంత్రంతో అభిమంత్రించి ధరించాలి! ఇది,

మానసికశాంతి, బుద్ధివికాసం, ఏకాగ్రత, దైవచింతన వృద్ధిపరచును! కుండలినీ శక్తిని మేలుకొలిపి పాపములు నశించును! కోరికలు సిద్ధించును!

## త్రిముఖీ రుద్రాక్ష :

మూడు ముఖములుగల ఈ రుద్రాక్ష అగ్నిస్వరూపము! ప్రయత్నించిన సత్కార్యములన్నిటినీ సిద్ధింపచేయును! **"ఐం హ్రీం శ్రీం"** అనుమంత్రంతో — జపించి సోమవారంనాడు ధరించి మంగళవారం పూజించాలి! పాలలో అరగదీసి తాగితే నేత్రరోగాలు తగ్గును! శత్రువులు నశిస్తారు! విద్యా ధనము, ఉద్యోగప్రాప్తి, కలుగును! యోగపురుషుల అనుగ్రహం కలుగును!

## చతుర్ముఖ రుద్రాక్ష :

ఇది చతుర్ముఖ బ్రహ్మ స్వరూపం! దీనిని ధరించినవారు నిత్య సంతోషంగా వుంటారు! వేదశాస్త్రాలలో ప్రవీణులు, జ్ఞానసంపన్నులు, బృహదారణ్యకుడు అగును! జ్ఞానశక్తి పెరుగును! కంఠంలో మాధుర్యం, కండ్లకు తేజస్సు, ముఖంలో ఆకర్షణ పెరుగును! **"ఓం హ్రీం శ్రీం క్రీం సౌం"** అన్నమంత్రంతో నమశ్శివాయ — అని జపంచేసి 108 సార్లుగాని, 1008 సార్లుగాని జపించి ధరించాలి! ధనప్రాప్తి, ఆనందం కలుగును! శిరస్సు కుడిభాగంలో దీనిని ధరించవలెను!

## పంచముఖ రుద్రాక్ష :

ఇది పంచబ్రహ్మ స్వరూపం! కాలాగ్ని రుద్రస్వరూపం! పురుష హత్యా పాపమునుకూడా నివారించును! దీనినికూడా సోమవారం **'ఓం హ్రీం నమః'** అన్న మంత్రంతో ధరించాలి! పాములు, తేళ్ళు, విషజంతువుల భయం నివారించును! శతృబాధలు నశింపచేయును!

ఇది, బ్రహ్మజ్యోతి స్వరూపము, వ్యభిచారము, అక్రమసంబంధ దోషముల

వంటి పాపములనుకూడా నశింపచేయును! పాపుల భోజన దోషము, దానములు పట్టిన దోషమూ నివారించును!

## ఆరు ముఖముల రుద్రాక్ష :

ఇది **కార్తికేయ షణ్ముఖస్వరూపము**! — అంటే కుమారస్వామి ఆకారము! దీనిని ధరించిన ఆరోగ్యం కలుగును! బుద్ధిబలం సభాజయమూ కలుగును! స్త్రీలలో కలిగే హిస్టీరియా, మూర్ఛ, అబార్షన్‌లవంటి జబ్బులను ఈ రుద్రాక్ష నివారించును! **"ఓం హ్రీం హ్రూం నమః"** అని **"ఓం సాం హ్రీం శ్రీం క్లీం శరవణభవ కార్తికేయాయనమః"** అన్నమంత్రంతో కలిపి జపించి ధరించిన బ్రహ్మహత్యా పాతకములుకూడా తొలగి గర్భస్రావాలు నిలుచును! **పురుషసంతానం** కలుగును!

## సప్తముఖ రుద్రాక్ష :

ఏడు ముఖములు కలిగిన రుద్రాక్ష మన్మథుని రూపం! దీనిలో బ్రాహ్మీ యోగీశ్వరి, కౌమారి, వైష్ణవి, చాముండి, వారాహి, ఇంద్రాణి అన్న — ఏడుగురు అమ్మవార్లు లేక **సప్తమాతృకలు** వుందురు! దీనిని ధరించేవారు ఆరోగ్యం కలిగి మహారాజయోగమును అనుభవించుదురు! **"ఓం క్లీం హుం నమః"** అన్నమంత్రంతో ధరించిన అనేక బాధలు నశింపచేయును! ఆయుధములూ అగ్ని వలన, అకాలమృత్యువునుంచీ, రక్షించును!

## అష్టముఖి రుద్రాక్ష :

ఎనిమిది ముఖములుగల రుద్రాక్ష అష్టమూర్తి — రుద్ర భైరవ స్వరూపం లేక అష్టముఖ గణపతి రూపం! దీనియందు అష్టవసువు లుందురు! దీనిని ధరించిన వారిపై **తంత్ర, మంత్ర ప్రయోగములు పనిచేయవు!**

పరస్త్రీ వలన దోషము, గురుద్రోహం వంటి మహాపాపములుకూడా తొలగించి పవిత్రం చేయును। మరణా నంతరం శివసాయుజ్యం కలిగించును।

## తొమ్మిది ముఖముల రుద్రాక్ష :

ఇది చాలా దుర్లభము, అలభ్యం। ఇది కపిలముని స్వరూపం। దీనిలో విద్యాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, శాంతశక్తి, వామశక్తి, జ్యేష్ఠాశక్తి, రౌద్రీశక్తి, అంగశక్తి, పశ్యంతీ అను **నవశక్తులు** ప్రతిష్టితమై వుండును। ఇది **ధర్మదేవతా** స్వరూపం।

## దశముఖ రుద్రాక్ష :

పదిముఖాలుగల రుద్రాక్ష — సాక్షాత్తూ విష్ణుస్వరూపం **"ఓం హ్రీం శ్రీం"** అన్న మంత్రంతో దీన్ని ధరించాలి। యమలోకబాధలు తొలగించును। మృత్యుభయం నివారించును। భూతప్రేత పిశాచములు దగ్గరకు రాలేవు। కార్యసిద్ధి, నవగ్రహాల అనుకూలత కలుగును। ఇది దొరకుట చాలా దుర్లభము।

## ఏకాదశముఖీ రుద్రాక్ష :

పదకొండు ముఖాలుగల ఈ రుద్రాక్ష సాక్షాత్తు **రుద్రాంశ స్వరూపం।** స్త్రీలకు సిరిసంపదలు, సర్వత్రా విజయము, సంతానప్రాప్తి లభిస్తాయి। దీనిని శిరస్సున ధరించవలెను। సౌభాగ్యవృద్ధి కలుగును

## పన్నెండు ముఖాల రుద్రాక్ష :

ఇది **సూర్యరూపము** లేక ద్వాదశాదిత్య స్వరూపం। **జ్యోతిష్కులకు భవిష్యత్తు** సరిగ్గా పలుకును। ఇది మహావిష్ణుస్వరూపం, ఆదిత్యరూపం। దీని పన్నెండు (12) ముఖములలో ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ఠ,

పూష, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు అను ద్వాదశాదిత్యుల అంశలూ ఈ రుద్రాక్ష యందుండును! ఇది బ్రహ్మచర్యం నిలుపును! వీర్యధారణ, నిత్యజయం కలిగించును! దొంగల భయం, అగ్ని భయం, వ్యాధిభయం ముఖ్యంగా కామెర్లు, జాండిస్‌వ్యాధి నివారించును! ఇంకనూ 13, 14, 15, 16 ముఖాల రుద్రాక్షలుకూడా చెప్పబడినవి, కాని అవి లభించుట దుర్లభము! ఇప్పటికింత చాలును

రుద్రాక్షలు ధరించి, ఉత్తరాయణపుణ్యకాలంలో యోగాభ్యాసం, జపం, ధ్యానం, ఉపవాసం చేయువారికి కాలపురుషుని సహాయం లభించును! శరీరంలోని పాపములు నశించి, రోగం నశించి ఏకాగ్రత కలిగి బుద్ధి చాంచల్యము నివారించి జాతకంలో ఆపదలు తగ్గిపోవును!

**గమనిక** : రుద్రాక్షను మంత్రంలేకుండా ధరించినవాడు భూతప్రేత పిశాచశక్తుల చేతిలో చిక్కును! లేక క్రూరజంతువులు సర్ప, వృశ్చికముల భయం కలుగును! మంత్రప్రయోగాదుల బాధలు కలుగును! ఇట్లు మంత్రంతో అభిమంత్రించి కనీసం 45 రోజులు మంత్రజపంతో రుద్రాక్షను ఆవాహం, జపం, తర్పణం, ప్రాణప్రతిష్టచేసి ఆలయంలో దేవునివద్దనుంచి ఒకరాత్రి ఆవాహనచేసి ధరించవలెను! రుద్రాక్ష ధరించియుండగా ప్రాణం విడిచినవారు శివలోకం, విష్ణులోకం, ఆదిత్యలోకమునకు చేరుదురు! ఇంకనూ రుద్రాక్షల మహిమ పూర్తిగా వ్రాయాలంటే అది ఒక ప్రత్యేక గ్రంధమగును! ఇప్పటికింత చాలు!



# శివపూజా రహస్యాలు-II
# మన్యుసూక్త విధానం

## విషయాను క్రమణిక!

## శివస్తోత్రాలు





# ముందుమాట!

ఇంతకుముందు నేను రచించిన **"శివపూజారహస్యాలు"** అన్న నా గ్రంథంలో **శివపంచాక్షరీ** ఉపాసనా విధాన రహస్యములను దీనికిముందు ప్రచురించిన **మొదటి** భాగములో అందించాను!

అందులో శివపంచాక్షరీ మంత్రం, పంచాక్షరముల రహస్యము, పంచతత్త్వాలు, పంచేంద్రియములు, పంచభూతములు, పంచాక్షరీ విద్యలో న్యాసంచేయు విధి, జీవాత్మ శివాత్మగా మారుట శివయోగి శివత్వము నందుట ప్రాచీన **రుద్రాధ్యాయ పారాయణా రహస్యాల**లో తెలిపిన పద్ధతి ప్రకారమును వివరించాను!

అందులో ఇంకనూ ఏకాదశ రుద్రుల పుణ్యక్షేత్రములు, శివుని అష్ట మూర్తులు వివరించి **మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం**లోని రహస్యాలు కొన్ని తెలిపివున్నాను! అందులో అమృత కలశారాధనావాహనతో మహాన్యాసములో కాలాత్మకుడై తానే రుద్రత్వము నందుట. కుంభేశ్వరుని అభిషేకంలోని

అమృతత్త్వం, **శక్తి పంచాక్షరీ** అంగన్యాస కరన్యాస జపవిధానములను, తెలిపి వున్నాను।

అందులోని పైవిషయాలకు అనుబంధంగా ఇప్పుడు **ఈ రెండవ భాగంలో మన్యుసూక్త విధానమును** ఇప్పుడు ఆస్తికులగు శివభక్తులకు అనుగ్రహ ఆశీఃపూర్వకంగా అందిస్తున్నాను।

రుద్రుని వివిధ రూపములలోకల్లా ఉగ్రమూర్తియగు **మన్యుదేవత** అధర్వణవేదంలో **పాశుపతాస్త్రమునకు** అధిష్టానదైవంగా చెప్పబడినాడు। మన్యుదేవతా రుద్రుడు, ఘోరమూర్తి! పాశుపతరుద్రుడు అఘోరమూర్తి! ఈ రెండింటినీ మంత్రించి ప్రయోగించు విధానంలో భేదము లున్నాయి।

వేదవిద్యలే నశించిపోతున్న ఈ చెడుకాలములో శిష్టాచారులగు బ్రాహ్మణులలోనే ముఖ్యముగా అర్చకులలో ఈ మన్యుదేవతా ఉపాసనా విధాన రహస్యములు **తెలియనివారే** ఎక్కువ। పెద్దలైన వేదపండితులనుండీ — ముఖ్యంగా **అధర్వణవేద** ప్రయోగ విధానంలో సిద్ధహస్తులగు ఋత్విక్కుల నుండీ శివదీక్షాపరులనుండి గ్రహించిన అనేక **మంత్రరహస్యాలను** ఈ గ్రంథంలో మీకు అందిస్తున్నాను।

ఈ **మన్యుసూక్తం** శత్రువినాశకరం! అంటే నిష్కారణంగా మనకు అపకారంచేయువారూ వారి స్వార్ధమునకు అడ్డువచ్చినామని మనపై చేతబడులు, క్షుద్రమంత్ర ప్రయోగాలూ చేయించే అధమాధములూ రోజురోజుకీ పెరిగిపోతున్నారు!

ఇట్టి ప్రయోగాలవల్ల బాధలుపడ్డ అనేకమంది అమాయకులు రోగము అనుకొని వైద్యంచేసి ప్రయోజనంలేక మరణించారు! ఈ దుష్టప్రయోగాలను ఏవిధంగా తిప్పికొట్టాలో తెలియక మన మంత్రాలపైన దేవతలమీద విశ్వాసం

పోగొట్టుకొన్నవారుకూడా అనేకమందినిచూసి అట్టి **శతృవినాశనం** కొరకు దీన్ని ప్రచురిస్తున్నాను ఎందుకంటే **ఆత్మరక్షణకొరకు అధర్వణ** వేదశాస్త్ర రహస్య మిచ్చిన **అస్త్రవిద్యయే** ఈ **మన్యుసూక్తం!**

## పాశుపతాస్త్రం :-

దీనికి మూలదేవత **తాపసమన్యూ రుద్రుడు**! మన్యు అనగా కోపము, ఆగ్రహము! శత్రువులను సంహరించాలంటే యోగి అయినవాడు కూడా ఈ ఆగ్రహాన్ని (సత్య+ఆగ్రహం) తనయందు ఆవేశింపచేసుకోవాలి! అట్టి ఆగ్రహమే ఈ **మన్యువు** దాని అధిష్టానదైవమే మన్యుదేవతా రుద్రుడు! ఇలా చేయడం యుక్తమా! అని కొందరు సందేహించవచ్చు! దానికి ఈక్రింది ఉదాహరణ చాలు!

మహాభారతయుద్ధంలో పాండవులవైపు ధర్మము ఉన్నందున శ్రీకృష్ణ భగవానుడు ధర్మరక్షణకై నిలిచినాడు! కాని ఒక్క అర్జునుడే, ప్రబలమైన భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు వంటి మహాశత్రువులను జయించి వారు ప్రయోగించే ఘోరమైన అస్త్రాలధాటికి భస్మంకాకుండా నిలబడగలడా? అందులోనూ ముఖ్యంగా ఇంద్రుడిచ్చిన శక్తి కర్ణుడు ప్రయోగించిన నాగాస్త్రమూ, ద్రోణాచార్యుడు ప్రయోగించిన ఘోరాస్త్రమూ, సమస్త పాండవసైన్యమునూ భస్మంచేసే ప్రమాదమునూ క్షణంలో గుర్తించాడు శ్రీకృష్ణపరమాత్ముడు!

మెరుపులా చెంగున రథమునుండి దూకి అర్జునుడిని దింపి సంహార రుద్రమూర్తిని ధ్యానింపచేశాడు! క్షణంలో అర్జునుడి దివ్యశరీరంతో తీసుకుని వెళ్లి — హిమాలయ పర్వతాలలోని **కైలాసం**వద్దనుంచాడు! అక్కడ ఘోర తపస్సులో మునిగివున్న రుద్రుడు నెమ్మది నెమ్మదిగా కన్నులు తెరిచి అయిష్టంగానే చూశాడు!

కృష్ణభగవానుని చూసి మందహాసంచేసి వచ్చిన పని తెలిసి ఎదురుగా వున్న సరస్సులో దిగి తనను తలచి అందులోవున్న **పాశుపతాస్త్రమును** మంత్ర పురస్సరంగా గ్రహించమని చెప్పాడు!

కాని అర్జునుడు ఆ సరస్సును సమీపించగానే అందులో భయంకర మైన **విషసర్పములు** బుసలుకొట్టుచూ కోపంతో కరవ వచ్చినవి! ఎన్నిసార్లు ప్రయత్నించినా అర్జునుడు వాటిని సమీపించలేకపోయాడు! అప్పుడు భగవాను డైన శ్రీకృష్ణుడు **పాశుపత మన్యుదేవతా రుద్రమూర్తిని** తలచి పూర్వం **ఉపమన్యుడనే ముని** వద్ద తాను విధిగా నేర్చుకున్న **మన్యుదేవతాస్త్రములను** స్మరించి ఆ సరస్సులోని పాములను నిర్భయంగా చేతబట్టి తీసినాడు! అంతే! భయంకరంగా బుసలుకొట్టుతున్న ఆ సర్పములు మరుక్షణమే ఒక ధనుస్సుగానూ ఇంకొక పాము బాణం (శరము) గానూ మారిపోయాయి!

అప్పుడు ధైర్యంచేసి అర్జునుడు ఆ పాశుపతాస్త్రములను గ్రహించి తిరిగి యుద్ధరంగంలో ప్రవేశించి భీష్మ, ద్రోణ మహామహులను నిలువరించాడు అయినప్పటికీ చివరగా వారు ప్రయోగించిన అస్త్రాల జ్వాలలకు అతడి రథము దివ్యాయుధములతోసహా భస్మమై మాడిపోయింది!



ఈవిధంగా **మన్యుదేవతా** **రుద్రుని** సహాయం అర్జునుడికి శ్రీకృష్ణ భగవానుని కృపవలన లభించినది! దానివలన శత్రువులను సంహరించి తాను బ్రతికి బయటపడినారు! అంతటి ప్రభావం కలిగినది, శత్రువినాశకరమగు ఈ క్రోధాగ్నిబలము!

అలాగే యమధర్మరాజును సహితం ఎదిరించి తనకు 16-ఏళ్ళు నిండ

గానే మృత్యువు రాసిపెట్టి ఉన్నప్పటికీ — **మార్కండేయ**మహర్షి రుద్రానుగ్రహం చేత మృత్యుంజయుడైనాడు! అందుచేత ఈ గ్రంథంలో **మన్యుదేవతా అస్త్రవిధాన రహస్యాలను** ఇప్పుడు మీకు — చాలాకాలం ముందు వెనకా సందేహించి వెనకాడినా — ఇప్పుడు బహిర్గతంచేసి ప్రచురిస్తున్నాను! ఈవిద్య పూర్తిగా నశించిపోకూడదన్న సంకల్పంతో!

## మన్యుసూక్తం – సాంప్రదాయం :–

ఈ **మన్యుసూక్త** విధానమునకు ఋషి **తాపసమన్యు** ఋషి! అధిష్టాన దేవత **మన్యుదేవతా**రుద్రుడు!

ఇది ఋగ్వేదంలోనూ అథర్వణవేదంలోనూ కూడా ఏయే శాఖలవారికి ఆ వేదశాస్త్ర సాంప్రదాయానుసారం ఇవ్వబడివున్నది! అందువల్ల **ఋగ్వేదప్రోక్త** అంగన్యాస కరన్యాసాలు విడిగా ఈగ్రంథంలో ఇచ్చివున్నాను! అలానే **అథర్వణ ప్రోక్త మన్యుసూక్త విధానంకూడా** ఇందులో వివరించాను! అవి తరువాత అధ్యాయాలలో చూసి పండితులైన విజ్ఞులు గ్రహించగలరు!

ఈ **మన్యుదేవతా సూక్తం** పారాయణావిధానం 1) ఋగ్వేద మన్యు దేవతా మంత్రసంపుటితో చేయవచ్చు! 2) **అథర్వణ మన్యువిధానం**తోనూ చేయవచ్చు! 3) **స్కందమంత్ర** సంపుటితో **కుమార తంత్రం**లో చెప్పబడిన విధానంతో చేయవచ్చు!

## యంత్రము :–

దానికి **స్కందషట్కోణ** యంత్రం స్కాంద తంత్రంలో వివరించారు! 4) అలానే పాశుపతరుద్ర సంపుటిలో **అనులోమ ప్రతిలోమ పాదార్చనలతో** ఈ **మన్యుసూక్త పూజావిధానం**కూడా చేయవచ్చు! దీనినికూడా సూచనగా అందించాను!

# ఆంజనేయునికి తైలాభిషేకం

## గ్రహదోషాలకు :

శని, కుజ, రాహుదోషాలతో జాతకంలో **మృత్యుగండం** లేక శత్రువుల వల్ల మరణభయంగాని కలిగినపుడు — **హనుమంతుని** విగ్రహమునకు తైలాభిషేకంచేస్తూ **మన్యుసూక్తంతో** రుద్రాభిషేకం చేయాలి।

మృత్యుంజయ మంత్ర సంపుటితో పాలాభిషేకం పంచామృతాభిషేకం చేయాలి।

ఇట్లు శతృవినాశమునకేకాక మనపై ప్రయోగించిన ప్రయోగాలు పోవుటకు మంత్రములకు లొంగని జ్వరబాధలు పీడించువారికి **ఇంద్రాక్షీ సంపుటితో** సర్వ జ్వరహర విధానంకూడా దీనితో ఇచ్చివున్నాను। ఇంకనూ **మృత్యుంజయ మంత్రం** కూడా సూచనగా ఇచ్చివున్నాను।

ఈ గ్రంథము నా **శివపూజారహస్యములు** అన్న నా మొదటి సంపుటికి **అనుబంధంగా** II-వ భాగంగా ఆస్తికులైన వారికి రక్షణ నిమిత్తం భగవత్ స్మరణ పూర్వకంగా అందిస్తున్నాను।

## అంకితం

ఈ రుద్రాధ్యాయం గ్రంథం మొత్తం భగవత్ సమానులగు కంచి కామకోటి పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ **జగద్గురు చంద్రశేఖరేంద్ర స్వామివారికి** పాద ప్రణామపూర్వకంగా **అంకితంచేస్తూ** దీనిని సత్పురుషుల ఆస్తికుల ఉపయోగార్థం పాఠకులకు అందిస్తున్నాను।

ఈ గ్రంథంపైన వచ్చే ఆదాయం వేదవిద్యలలో నేను స్థాపించిన

**యూనివర్సిటీ ఆఫ్ వేదిక్** సైన్సు చదివే వేదిక్‌సైన్సు [**University of Vedic Sciences** (USA)] లో B Sc **వేదిక్ హిందూఇజమ్** (Vedic Hinduism) BA, MA **డిగ్రీలకు** విద్యానిధికి ట్రస్టుకు దానం చేస్తున్నాను!

మీరు ఇచ్చే ప్రతీ పైసా ఈ **వేదిక్ యూనివర్సిటీకే** చెందును

సర్వేజనా సుఖినోభవంతు!

ఇట్లు

మీ

**వేదవ్యాస, I.A.S., Ph.D.**

ప్రెసిడెంట్

**వేదిక్ యూనివర్సిటీ** (USA)

"గురుస్థానం"

హైదరాబాద్

6-2-2002



## 12

# మన్యుసూక్తం

## స్కంద మంత్ర సంపుటితో

ఆచమ్య । దేశకాలౌ సంకీర్త్య । గోత్రనామాదీనుచ్చార్య । మమ । బాహ్యాంభ్యంతరయోః మాముద్దిశ్య శత్రుకృత మంత్ర తంత్ర యంత్ర శల్య విషమూలికా చూర్ణప్రయోగాద్యాభిచారికాది ఉపద్రవాది నిర్హరణార్థం స్కంద కుమార మంత్రగ్రథిత మన్యుసూక్తమహామంత్రజపం కరిష్యే । (విప్రద్వారా వా కరిష్యే)

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనాముపమ శ్రవస్తమం ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆన శ్శృణ్వన్నూతిభి స్సీద సాదనం



శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః

అస్య శ్రీ స్కందమంత్ర సంపుటిత మన్యుసూక్త మహామంత్రస్య సదాశివ । తాపసపుత్ర వశిష్ఠో ఋషీ ।

అనుష్టుప్ త్రిష్టుప్ బృహతీ ఛందాంసి
శ్రీస్కందో మన్యుః పరమాత్మా దేవతా
సాం హ్రాం । బీజం
సీం హ్రీం । శక్తి
సూం హ్రూం । కీలకం । మమ సకల స్త్రీపురుష రాజ మంత్రిభట సైన్యాది సర్వజీవి జంతు భయవశ్యార్థే జపే వినియోగః ।

## కరన్యాసము :

ఓం సాం హ్రాం సంసృష్టం ధనముభయం – అంగుష్ఠాభ్యాం నమః
ఓం సీం హ్రీం సమాకృత మస్మభ్యం ధత్తాం – తర్జనీభ్యాం నమః
ఓం సూం హ్రూం వరుణశ్చ మన్యుః – మధ్యమాభ్యాం నమః
ఓం సైం హ్రైం భియో దధానా హృదయేషు – అనామికాభ్యాం నమః
ఓం సౌం హ్రౌం శత్రవః పరాజితాసః – కనిష్ఠికాభ్యాం నమః
ఓం సః హ్రః అపనిలయంతాం – కరతల కరపృష్ఠాభ్యాం నమః

## అంగన్యాసము :

ఓం సాం హ్రాం – సంసృష్టం ధనముభయం – హృదయాయ నమః
ఓం సీం హ్రీం సమాకృత మస్మభ్యం ధత్తాం – శిరసే స్వాహా
ఓం సూం హ్రూం వరుణశ్చ మన్యుః – శిఖాయై వషట్
ఓం సైం హ్రైం భియో దధానా హృదయేషు – బలాయ కవచాయహుం
ఓం సౌం హ్రౌం శత్రవః పరాజితాసః – నేత్ర త్రయాయ వౌషట్
ఓం సహి హ్రః అపనిలయంతామ్ – అస్త్రాయ ఫట్

భూర్భువ స్సువరో మితి దిగ్బంధః

## ధ్యానమ్

శ్లో॥ ధ్యాయేత్ స్కందం త్రినయనం కుమారం కుక్కుట ధ్వజం
కోటిసూర్య ప్రతీకాశం అభీష్టార్థ వరప్రదం ।

శ్లో॥ ధ్యాయేత్ మహా మన్యురుద్రం మహా క్రోధ స్వరూపిణం
దుష్టారిష్ట హరం దేవం క్రూరవైరి వినాశనం ॥
— లమితి పంచపూజాం కుర్యాత్

## మూలమంత్రం

ఓం సాం శరవణభవ
ఓం సంస్పృష్టం ధనముభయం
సమాకృత మస్మభ్యం ధత్తాం వరుణశ్చ మన్యుః
భియోదధానా హృదయేషు
శత్రవః పరాజితాసో అపనిలయంతాం
ఓం సాం శరవణ భవ

(అని 11-సార్లు జపించాలి)

## 1-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం యస్తే మన్యో విధ ద్వజ్రసాయక
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం సహఓజః పుష్యతి విశ్వమానుషక్
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం సాహ్యామదా సమార్యం త్వయా యుజావయం
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం సహస్కృతేన సహసా సహస్వతా
ఓం సాం శరవణభవ 4

## 2-ఋక్కు

ఓం సాం శరవణ భవ
ఓం మన్యురింద్రో మన్యురేవా స దేవః
ఓం సాం శరవణ భవ 1

ఓం సాం శరవణభవ
ఓం మన్యుర్హోతా వరుణో జాతవేదాః
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం మన్యుర్ విశ ఈళతే మానుషీర్యాః
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం పాహినో మన్యో తపసా సజోషాః
ఓం సాం శరవణభవ 4

## 3-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం అభీహి మన్యో తవస స్తవీయాన్
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం తపసా యుజావి జహి శత్రూన్
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం అమిత్ర హా వృత్రహా దస్యుహా చ
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం విశ్వా వసూ న్యాభరాత్వన్నః
ఓం సాం శరవణభవ 4

## 4-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం త్వం హి మన్యో అభిభూత్యోజాః
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం స్వయంభూ ర్భామో అభిమాతిషాహః
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం విశ్వచర్షణి స్సహురి స్సహీయాన్
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం అస్మాస్వోజః పృతనాసు ధేహి
ఓం సాం శరవణభవ 4

## 5-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం అభాగ స్సన్నప పరేతో అస్మి
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం తవ క్రత్వా తవిషస్య ప్రచేతాః
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం తంత్వా మన్యో అక్రతుర్జహీళాహం
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం స్వా తనూ ర్బలదావా న ఏహి
ఓం సాం శరవణభవ 4

## 6-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం అయంతే అస్మ్యుపన ఏహ్యర్వాన్
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం ప్రతీచీన స్సహురే విశ్వధావన్
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం మన్యో వజ్రిన్నభిన ఆవవృత్స్వ
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం హనావ దస్యూంన్ రుతపోధ్యాపేః
ఓం సాం శరవణభవ 4

## 7-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం అభిప్రేహి దక్షిణతో భవానః
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం అధావృత్రాణి జంఘనావ భూరి
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం జుహోమి తే ధరుణం మధ్వో అగ్రం
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం ఉభా ఉపాంశు ప్రథమా పిబావ
ఓం సాం శరవణభవ 4

## 8-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం త్వయా మన్యో సరథ మారుజంతః
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం హర్షమాణాసో హృషితా మరుత్వన్
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం తిగ్మేషవ ఆయుధా సంశిశానాః
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం అపప్రయంతు నరో అగ్నిరూపాః
ఓం సాం శరవణభవ 4

## 9-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం అగ్నిరివ మన్యో త్విషిత స్సహస్వ
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం సేనానీర్న స్సహురే హూత ఏధి
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం హత్వాయ శత్రూన్ విభజస్వ వేద
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం ఓజోమిమానో విమృధో అనుదస్వ
ఓం సాం శరవణభవ 4

## 10-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం సహస్వమన్యో అభిమాతి మస్మై
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం రుజన్ పృణన్ ప్రమృణన్ ప్రేహి శత్రూన్
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం ఉగ్రంతేపాజో నన్వారురుధ్రే
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం వశీ వశన్నయా సా ఏకజత్వం
ఓం సాం శరవణభవ 4

## 11-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం ఏకో బహూనామసి మన్యు రీడితా
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం విశం విశం యుద్ధయే సంశిశాధి
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం అకృత్త రుక్త్వయా యుజా వయం
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం ద్యుమంతం ఘోషం విజయాయ కృణ్మసి
ఓం సాం శరవణభవ 4

## 12-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం విజేష కృదింద్ర ఇవానవ బ్రువః
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం అస్మాకం మన్యో అధిపా భవేహ
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం ప్రియంతే నామ సహూరే గృణీమసి
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం విద్మాత ముత్సం యత ఆబభూధ
ఓం సాం శరవణ భవ 4

## 13-ఋక్కు

ఓం సాం శరవణభవ
ఓం ఆభూత్యా సహజా వజ్రసాయక
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం సహో బిభర్షి సహభూత ఉత్తరం
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం కృత్వానో మన్యో సహమే ధ్యేధి
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం మహో ధనస్యా పురుహూత సంసృజి
ఓం సాం శరవణభవ 4

## 14-ఋుక్కు

ఓం సాం శరవణభవ
ఓం సంసృష్టం ధనముభయం సమాకృతం
ఓం సాం శరవణభవ 1

ఓం సాం శరవణభవ
ఓం అస్మభ్యం ధత్తాం వరుణశ్చ మన్యుః
ఓం సాం శరవణభవ 2

ఓం సాం శరవణభవ
ఓం భియో దధానా హృదయేషు శత్రవః
ఓం సాం శరవణభవ 3

ఓం సాం శరవణభవ
ఓం పరాజితాసో అపనిలయంతాం
ఓం సాం శరవణభవ 4

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
సహనావవతు ద్విషావహై
శాంతి శ్శాంతి శ్శాంతిః

అనేనమయా కృతేన స్కందమంత్రగ్రంధిత మన్యుసూక్త జపేన భగవాన్ సర్వాత్మకః, శ్రీమన్యుదేవతా సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు ॥

సమాప్తం

ఇందు 1 సంపుటిత మన్యుసూక్తపారాయణకు

169 ప్రణవములు

338 స్కందమూలమంత్రము

56 మన్యుసూక్త పాదర్చలు వచ్చును

నమకమంత్రముల సంఖ్య 169 గాన ఇది ప్రత్యక్ష ఫలప్రదమనుట నిర్వివాదము

## ఫలశృతి

వైరిబాధావినశ్యతి - (శత్రుబాధ నశించును)

అరయః సంక్షయంయాంతి మన్యుదేవ ప్రసాదతః
సర్వ దుష్టప్రశమనం సర్వ కష్టనివారణం
ఇత్యాదీని బహూనిసంతి ఇతిశం



# 13

# వివిధ మంత్రసంపుటిత విధాన మన్యుసూక్తము

## i) నారాయణీదుర్గా సంపుటి (సర్వకార్యజయమునకు)

మంత్రం :–

శ్లో॥ దుర్గే శివేఽభయేమాయే నారాయణి సనాతని
జయేమే మంగళందేహి నమస్తే సర్వమంగళే

## ii) సౌరసంపుటితము (సత్వరారోగ్యప్రదము)

మంత్రం :– ఘృణి స్సూర్య ఆదిత్య ఓం

## iii) పాశుపత సంపుటితము (శతృనాశనము)

మంత్రం :– ఓమ్ శ్లీం పాశుపతాస్త్రాయ హుం ఫట్ స్వాహా

## iv) శూలినీ దుర్గాసంపుటితము (దుష్టగ్రహ నాశనము)

మంత్రం :– జ్వలజ్వల శూలినీ దుం దుష్టగ్రహ హుంఫట్ స్వాహా

## v) ఋణ విమోచన అంగారక సంపుటి (సర్వఋణవిమోచనము)

మంత్రం –

శ్లో॥ అంగారక మహీపుత్ర భగవాన్ భక్తవత్సల
నమోస్తుతే మమ అశేష ఋణమాశు విమోచయ

## vi) శివపంచాక్షరీ సంపుటి (సర్వపాపహరము)

మంత్రం :– ఓం నమశ్శివాయ

## vii) ఇంద్రాక్షీ సంపుటితము (సర్వజ్వరహరము)

మంత్రం :– భస్మాయుధాయ విద్మహే రక్తనేత్రాయ ధీమహీ
తన్నోజ్వరః ప్రచోదయాత్

## viii) మృత్యుంజయ సంపుటితము (అపమృత్యుహరము)

మంత్రం :– త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఉర్వారుక మివబంధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్

[సూచన – మన్యుసూక్తమునందలి పాదర్చలకు పై మంత్రములను వారివారి కామ్యముల ననుసరించి ప్రణవ, స్వరయుక్తముగా సంపుటీకరణంచేసి జపము చేసికొనిన వారివారి అభీష్టార్థముల బడయగలరు ]

ఇతి శ్రీశ్రీశ్రీ తాపసపుత్ర వశిష్ఠమునినా ఉద్ధారితం అథర్వప్రోక్తం
స్కందమంత్రాది సకలమంత్ర సంపుటితం, మన్యుసూక్తం
సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు



# 14

# ఋగ్వేద-మన్యుసూక్తము

## ఋగ్వేద మన్యుసూక్తమునకు అంగన్యాస కరన్యాస ధ్యానశ్లోకములు

అస్యశ్రీ మన్యుసూక్తస్య । తాపసపుత్రో వశిష్ఠఋషిః । త్రిష్టుప్ఛందః । మన్యుః పరమాత్మాదేవతా । హ్రాం బీజం హ్రీం శక్తిః హ్రూం కీలకం । మమ మన్యుదేవతా ప్రసాదసిధ్యర్థే జపే వినియోగః ।

ఓం హ్రాం – అంగుష్ఠాభ్యాం నమః – జ్ఞానాయ హృదయాయ నమః
ఓం హ్రీం – తర్జనీభ్యాం నమః – ఐశ్వర్యాయ శిరసేస్వాహాః
ఓం హ్రూం – మధ్యమాభ్యాం నమః – శక్త్యై శిఖాయైవషట్

ఓం హ్రైం – అనామికాభ్యాం నమః – బలాయ కవచాయహుం
ఓం హ్రౌం – కనిష్ఠికాభ్యాం నమః – తేజసే నేత్రాభ్యాం వౌషట్
ఓం హ్రః – కరతల కరపృష్టాభ్యాం నమః– వీర్యాయ అస్త్రాయ ఫట్

ఇతి షడంగన్యాసః. అనంతరం

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

## ధ్యానం :

శ్లో॥ ధ్యాయే న్మహామన్యురుద్రం మహాక్రోధస్వరూపిణం
దుష్టారిష్టహరం దేవం క్రూరవైరి వినాశనం

ఇతి ధ్యాత్వా । లమిత్యాది పంచపూజాం కుర్యాత్
ఓం యస్తే మన్యో = అపనిలయంతాం ఇతి

## లమిత్యాది పంచపూజా :

ఓం లం పృథివ్యాత్మికాయై – గంధోపచారం సమర్పయామి
ఓం హం ఆకాశాత్మికాయై – పుష్పం సమర్పయామి
ఓం యం వాయ్వాత్మికాయై – ధూపమాఘ్రపయామి
ఓం రం అగ్నేయాత్మికాయై – దీపం దర్శయామి
ఓం వం అమృతాత్మికాయై – అమృత మహానైవేద్యం సమర్పయామి
ఓం సం సర్వాత్మికాయై – సర్వోపచార పూజాం సమర్పయామి

# ఋగ్వేద మంత్రపాఠము

ఓం యస్తే మన్యోఽవిధద్వజ్ర సాయక సహ్న ఓజః పుష్యతి విశ్వమానుషక్ ।
సా సాహ్యామదా సమార్యస్త్వయా యుజా సహస్కృతేన సహసా సహస్వతా ॥ 1

ఓం మన్యురింద్రో మన్యురేవా సదేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః ।
మన్యుం విశ ఈళతే మానుషీర్యాః పాహినో మన్యో తపసా సజోషాః ॥ 2

ఓం అభీహి మన్యో తపసస్త వీయాన్ తపసా యుజావి జహి శత్రూన్ ।
అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వావసూ న్యాభరాత్వం న్నః ॥ 3

ఓం త్వంహి మన్యో అభిభూ త్యోజా స్స్వయంభూ ర్భామో అభిమాతిషాహః ।
విశ్వచర్షణి స్సహాయుజా న స్మా న్వోజః పృతనాసు ధేహి ॥ 4

ఓం అభాగ స్సన్నప పరేతో అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతః ।
తంత్వా మన్యో అక్రతు ర్జహిళాహం స్వాతనూ ర్బల దేయాయ మేహి ॥ 5

అయంతే అస్మ్యుపయే హ్యర్వాన్ప్రతీచీన సహురే విశ్వధాయ ।
మన్యో వజ్రిన్నభిమామవ వృత్స్వః హనావదస్యూం రుతబో ధ్యాపే ॥ 6

అభిప్రేహి దక్షిణతో భవానో దా వృత్రాణి జంఘనావ భూరి ।
జుహోమితే ధరుణంమధ్వోఽగ్రముభా ఉపాంశు ప్రథమా పిబావ ॥ 7

త్వయామన్యో సరథమారుజంతో హర్షమాణా సో ధృషితా మరుత్వా ।
తిగ్మేషవ ఆయుధా సంశిశాన అభిప్రయంతు నరో అగ్నిరూపాః ॥ 8

ఓం హ్రౌం శత్రవః పరాజితాస. - కనిష్ఠికాభ్యాం నమః - తేజసే నేత్ర త్రయాభ్యాం వౌషట్
హ్రః అపనిలయంతాం - కరతల కరపృష్టాభ్యా నమః - వీర్యాయ అస్త్రాయ ఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ఓం యస్తే మన్యోఽవిధ ద్వజ్రసాయక సహ ఓజః పుష్యతి విశ్వమానుషక్ ।
సాహ్యామదా సమార్యం త్వయా యుజా వయం సహస్కృతేన సహసా సహస్వతా ॥ 1

ఓం మన్యురింద్రో మన్యురేవా స దేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః ।
మన్యుర్విశ ఈళతే మానుషీర్యాః పాహినో మన్యో తపసా సజోషాః ॥ 2

ఓం అభీహి మన్యో తవస స్తవీయాంన్ తపసా యుజావి జహి శత్రూన్ ।
అమిత్రహా వృత్రహా దస్యుహా చ విశ్వా వసూ న్యాభరాత్వన్నః ॥ 3

ఓం త్వంహి మన్యో అభిభూర్యోజా స్వ్యయంభూ ర్భామో అభిమాతిషాహః
విశ్వచర్షణి స్సహురి స్సహీయా నస్మాస్వోజః పృతనాసు ధేహి ॥ 4

ఓం అభాగ స్సన్నప పరేతో అస్మి తవ క్రత్వా తవిషస్య ప్రచేతాః ।
తంత్వా మన్యో అక్రతు ర్జహీళాహం స్వాతనూ ర్బలదావాన ఏహి ॥ 5

ఓం అయన్తే అస్మ్యపనయేహ్యర్వా ఙ్ప్రతీచీన స్సహురే విశ్వ ధావన్ ।
మన్యో వజ్రిన్నభిన ఆవవృత్స్వ హవాన దస్యూజ్ రుతపో ధ్యాపేః ॥ 6

ఓం అభిప్రేహి దక్షిణతో భవానోధా వృత్రాణి జంఘనావ భూరి ।
జుహూమి తే ధరుణం మ్మధ్వో అగ్రముభా ఉపాంశు ప్రధమా పిబావ ॥ 7

ఓం త్వయా మన్యో సరథమారుజంతో హర్షమాణా సోహృషితా సోమరుత్వన్ ।
తిగ్మేషవ ఆయుధా సంశిశానా అపప్రయంతు నరో అగ్నిరూపాః ॥ 8

ఓం అగ్నిరివ మన్యో త్విషిత స్సహస్వ సేనానీ ర్నస్సహురే హూత ఏధి ।
హత్వాయ శత్రూన్ విభజస్వ వేద ఓజోమి మానో విమృధోఽఅనుదస్వ ॥ 9

ఓం సహస్వమన్యో అభిమాతి మస్మై రుజ న్ఛృణ న్ప్రమృణ న్ప్రేహి శత్రూన్ ।
ఉగ్రంతే పాజో నన్వారురుధ్ర వశీ వశన్నయాసా ఏకజ త్వం ॥ 10

ఓం ఏకో బహూనా మసి మన్య ఈళితా విశం విశం యుద్ధయే సంశిశాధి ।
అకృత్త రుక్త్వయా యుజా వయం ద్యుమంత ఘోషం విజయాయ కృణ్మసి ॥ 11

ఓం విజేష కృదింద్ర ఇవా నవబ్రవ్యోన్ఽస్మాకం మన్యో అధిపా భవేహ ।
ప్రియంతే నామ సహురే గృణామసి విద్మా తముత్సం యత ఆ బభూవ ॥ 12

ఓం అభూత్యా సహజా వజ్రసాయక సహో బిభర్షి సహభూత ఉత్తరం ।
కృత్వానో మన్యో సహమేద్యేఽధి మహాధనస్య పురుహూత సంసృజి ॥ 13

ఓం సంసృష్టం ధన ముభయం సమాకృత మస్మభ్యం ధత్తాం వరుణశ్చ మన్యుః ।
భియో దధానా హృదయేషు శత్రవః పరాజితా సో అపనిలయంతామ్ ॥ 14

ఓం ధన్వనాగా ధన్వనాజిం జయేమ ధన్వనా తీవ్రా స్సమదో జయేమ ।
ధనుశ్శత్రో రపకామం కృణోతి ధన్వనా స్సర్వాః ప్రదిశో జయేమ ॥ 15

ఇది – అధర్వణ మన్యుసూక్తం

## ధ్యానమ్ :

శ్లో॥ పద్మాసనే సమాసీనం ధ్యాయంతం ధ్యానముద్రయా
ధ్యాయేత్తాపసమన్యుంచ మనోభీష్ట వరప్రదం
జ్వాలనార్కప్రతీకాశం జటామకుట మండితం
బ్రహ్మశ్రియా విరాజం చ దీప్యమానం మహోఋచా
శూలచక్రాబ్జ ఖడ్గాది దశాయుధ మహాబలం
దంష్ట్రాకరాళవదనం ధ్యాయేన్మన్యుం మహేశ్వరం
ఇతి ధ్యాత్వా లమితి పంచపూజాం కుర్యాత్
ఓంయస్తే నిలయన్తామ్ ఇతి




## ప్రయోగము :

ఎఱ్ఱని పుష్పములతో ఎఱ్ఱటి అక్షతలతో మూలమంత్రముతో, జప పూజాతర్పణములు చేయవలెను



# 16

# హోమద్రవ్యములు

భయ వశ్యమునకు **మేడి** సమిధలు నేతిలో ముంచి హోమము చేయవలెను.

దుష్ట శత్రువుల ఉచ్చాటనకు **తిలలు** నేతిలో కలిపి హోమము చేయవలెను.

శత్రుకృత అభిచారకములు **త్రిప్పిపంపుటకు** స్మశాన స్థిత - **తెల్లజిల్లేడు** సమిధలు **తిలతైలములో** ముంచి హోమము చేయవలెను.

ఆత్మరక్షణకు **ఆవుపాల** క్షీరాన్నములో నేయి కలిపి హోమముచేయవలెను.

# జపము

3 రోజులు 3000 జపం

300 — **తర్పణం**

**30 — హోమం**

5 రోజులు రోజూ 5000 జపం

500 — తర్పణం

**50 — హోమం**

9 రోజులు 9000 జపం

900 — తర్పణం

**90 — హోమం**

11 రోజులు 11000 జపం

1100 — తర్పణం

**110 — హోమం**

అనంతరం **11-మందికి** బ్రాహ్మణ భోజనం పెట్టవలెను.

ఇతి మన్యుసూక్త ప్రయోగము సమాప్తం



17

# మూలికా గ్రహణవిధి

ఆదౌ వృక్షమూలం గత్వా । తదంతే చాఽభిమంత్ర్య ।
మంత్రః భేతాళాశ్చ పిశాచాశ్చ రాక్షసాశ్చ సరీసృపాః
అపసర్పంతు తే సర్వే వృక్షాదస్యాత్ శివాజ్ఞయా
నమస్తే అమృత సంభూతే బలవీర్య వివర్ధనీ
పరమాయుశ్చ మే దేహి పాపాన్మే త్రాహి దూరతః
యేనత్వాం ఖనతే బ్రహ్మ యేనత్వాం ఖనతే భృగుః
యేన ఇంద్రో అతోవరుణో ఏన త్వాముపచక్రమే
తేనాహమేవక్ష్యామి మంత్రపూతేన పాణినా
మాయేపాతే మానిపాతి మాతేభేజోన్యథాభవేత్
తత్రైవ తిష్ఠ కళ్యాణి మమ కార్యకరీ భవ
"ఓం హ్రీం క్లాం ఫట్ స్వాహా"

— అని మూలికమొక్కను ఊడపీకవలెను

ఇత్యేవం సర్వవిద్యానాం షట్కర్మానాం సు సిద్ధయే
కథితంచాత్ర యత్నేన మూలికా గ్రహణం శుభం
విధి మంత్రసమాయుక్తం ఔషధం సఫలం భవేత్
విధి మంత్రవిహీనం తు కాష్టవద్భేషజం భవేత్
వల్మీక కూప రథ్యా తరుతల వన దేవాలయ
స్మశానేషు జాతాః విధినా విహితాః అప్యౌషధయః సిద్ధిదాః నను ॥

— ఇతి దత్తాత్రేయ తంత్రే మూలికా గ్రహణ విధానం

దానికి కావలసిన మూలికలు సంగ్రహించే విధానము ఈ అధ్యాయంలో చెప్పబడినది **మన్యుసూక్తమునకు** "శ్వేతార్కము" అనగా తెల్లజిల్లేడు మంత్రములకు పనికివచ్చు మూలిక

ఇట్టి మూలిక కోసం త్రవ్వితీసే శ్వేతార్కము అతి తెల్లటి పూవులు కలిగి తెల్లని ఆకులు కలిగిన **"తెల్లజిల్లేడు"**. మామూలు జిల్లేడుపూలకువలే వయొలెట్ రంగు లేకుండా శుద్ధమైన **తెలుపు**వర్ణములో మల్లెపూలవలే వుండవలెను

ఈవిధంగా త్రవ్వి తీసే శ్వేతార్కము వీధిలో అందరూ మలమూత్రాదులకు విసర్జించబడేచోట ఉన్నచో పనికిరాదు! అడవిలో దూరంగా జనసంచారం లేనిచోట పెరిగేచెట్టు కావలెను ఆ వృక్షం బాగా వయస్సు ముదిరినది సుమారు 30 ఏళ్ళ వయస్సు పైబడినది తీయవలెను ఎంత ఎక్కువ వయస్సు ఉన్నచెట్టైతే అంత శ్రేష్టము అలాగ వయసు ముదిరిన శేతార్క వృక్షము మొదలు మ్రానువలె 6 నుంచి 12 అంగుళములు దళసరిగా వుండే చెక్కవలే గట్టిపడినవేరు పుచ్చులేకుండా చెదలుపట్టనిదై వుండవలెను

అలా సర్వ మంచి లక్షణములూ కలిగిన **తెల్ల జిల్లేడు చెట్టును** **సుబ్రహ్మణ్య** మంత్రముతోగాని, **ఆంజనేయ** మంత్రముతో లేక **మన్యుదేవతా**

మంత్రముతోగాని సమీపించి తీర్థము, అక్షతలూ చల్లుతూ పసుపుతోకూడిన నీళ్ళతో అభిమంత్రించాలి అప్పుడు ఒక పసుపు దారమును చెట్టుమూలము నకు ప్రదక్షిణంగా కట్టి, మూడుసార్లు ఆ చెట్టుచుట్టూ ప్రదక్షిణం తిరుగుతూ ఈక్రింది మంత్రాన్ని పఠించాలి!

**"భేతాళాశ్చ పిశాచాశ్చ రాక్షసాశ్చ సరీసృపాః**
**అపసర్పంతు తే సర్వే వృక్షాదస్మాత్ శివాజ్ఞయా"**

(అనగా ఈ వృక్షమును ఆశ్రయించివున్న పాములూ, తొండలూ వంటి జీవులూ, భేతాళ భూత పిశాచములు, రాక్షస శక్తులూ అన్నీ ఈ చెట్టునుండి శివాజ్ఞ వలన తొలగిపోవలెను అని సంకల్పించి,

**నమస్తే అమృత సంభూతే బలవీర్య వివర్ధనీ**
**పరమాయుశ్చ మే దేహి పాపాన్మేత్రాహి దూరతః**
**యేన త్వాం ఖనతే బ్రహ్మ యేనత్వాం ఖనతే భృగుః**
**యేన ఇంద్రో అతో వరుణో ఏనత్వా ముపచక్రమే**
**తేనాహమేవ ముక్ష్యామి మంత్రపూతేన పాణినా**
**మయే పాతే మానిపాతి మాతేభేజోన్యథా భవేత్**
**తత్రైవ తిష్ఠ కళ్యాణి మమకార్యకరీభవ.**

(అనగా **"ఓ అమృతస్వరూపిణీయగు వృక్షమా! నాకు బలవీర్యములను వృద్ధిచేయుము. సమస్త పాపములనూ నిర్మూలించుము! నాకు పరమా యుష్షును అనుగ్రహించుము. ఏమంత్రముతో బ్రహ్మ మూలికలను త్రవ్వెనో దేనితో నిన్ను భృగుమహర్షి త్రవ్వెనో దేనితో ఇంద్రుడు, వరుణుడు నిన్ను గ్రహించిరో దానివలన చక్రముగా ప్రదక్షిణము తిరుగుతూ, మంత్రముచేత పవిత్రమైన హస్తముతో నిన్ను పెళ్ళగించుచున్నాను."**

"**ఓ వృక్షరాజమా! నీ ఆత్మకు సద్గతి కల్గుగాక!** నాపని సర్వవిధములా సిద్ధిపొందునుగాక! నా పనులను పూర్తికావింపుము!" అను పైమంత్రమును చదివి మూడుసార్లు ఆ చెట్టుకు ప్రదక్షిణము చేస్తూ

**"ఓం హ్రీం క్రాం ఫట్ స్వాహా"**

అని గట్టిగా ఉచ్చరిస్తూ చెట్టును పెళ్ళగించవలెను చెట్టువేళ్ళను కత్తితో నరకరాదు! గడ్డపారతో చర్మము చిట్లరాదు! త్రవ్వినవెంటనే వెలికితీసి శుభ్రముగా కడిగి పసుపురాసి కుంకుమ బొట్టుపెట్టి నాల్గుదిక్కులా అగరు వత్తులు వెలిగించి, నిమ్మకాయలు, (పసుపూ, కుంకుమా బొట్టుపెట్టినవి) చెట్టునకు బలిగా కోసి డిప్పలను తన తలపైనుంచి వెనుకగా ఒకటి చెట్టు మీదుగానూ, రెండో నిమ్మకాయనుకోసి డిప్పలను చెట్టుకు కుడిఎడమలకూ విసరవలెను మూడవ నిమ్మకాయను చెట్టుకు ఆహారముగా బలినిచ్చి, స్కంద మంత్రముతోగాని, ఆంజనేయమంత్రముతోగాని మూలమంత్రాన్ని జపిస్తూ పసుపులో నిమ్మకాయ రసమును కలిపి దానిని జిల్లేడు చెట్టుయొక్క మూలమునకు పూయవలెను

ఆ మూలమును (వేరు) తెచ్చి యింటిలో 14-15 రోజులపాటు నీడన వుంచి పచ్చి పూర్తిగా ఆరేటంతవరకూ మూలమంత్రముతోనే పూజించాలి

ముందుగా విఘ్నహరుడగు గణపతిని దానియందు ఆవాహనచేసి సర్వ విఘ్నముల నివారణకై ప్రార్థించవలెను

ఆతరువాత ఆ మూలికను 'స్కంద' లేక **'హనుమత్'** లేక **'మన్యు దేవత'** లను ఆవాహనంచేసి, మూలమంత్రంతో జపంచేసి, కుంకుమతో పసుపుతో, అక్షతలతో పూజించాలి

ఇలా పూర్తిగా మూలిక ఎండిపోయాక దానిని ఉత్తమ శిల్పాచార్యుడగు స్థపతికిచ్చి తానుకోరిన ఇష్టదేవతా విగ్రహముగా చెక్కించాలి ఆ విగ్రహాన్ని పవిత్రంగా శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణములు కూడిననాడు ప్రాణ

ప్రతిష్టగావించి, దానియందు దేవతా ఆవాహనముచేసి పూజాపీఠముపై ఉంచి పూజించాలి! ఇట్లు 45 రోజులుగాని, 60 రోజులుగాని పూజించాలి

పౌర్ణమి, అమావాస్యలయందు, పర్వదినములయందూ చక్కెరపొంగలి, క్షీరాన్నము లేక బెల్లంతోకూడిన పెసలను లేదా పొంగలిని నివేదనగా పెట్టాలి! ఆపైన మన్యుసూక్త పారాయణలో **పూజావిగ్రహం**గా దానిని వినియోగించాలి!

ఇది మూలికా సంగ్రహణవిధానము! ఎవరైతే తెల్లజిల్లేడు చెట్టును ఈవిధంగా ప్రాణప్రతిష్ఠచేసి, పైనచెప్పిన విధానంలో మూలమంత్రసహితంగా పూజానుష్ఠానములు చేయక వినియోగిస్తారో అప్పుడది మామూలు చెక్కవలే నిర్జీవమౌతుంది అట్టి విగ్రహం ఎట్టి ఫలితాన్నీ యివ్వదు!

పైనచెప్పిన పద్ధతిని సంగ్రహించిన మూలికలోనికి ఇష్టదేవతావాహన చేసి నిత్యపూజలో వినియోగించినట్లైతే దేవతానుగ్రహం తప్పక పొందవచ్చును

ఆంజనేయ విగ్రహంగాని, సుబ్రహ్మణ్యస్వామి విగ్రహంగాని లేక మన్యుదేవతామూర్తి విగ్రహంగాని లేదా ఆదిశక్తి విగ్రహాన్నిగాని ఈ మూలికతో చెక్కించవచ్చు

ఈవిధంగా శ్వేతార్కమును తీసుకునే తరుణంలో తల్లివేరుకు **ఉత్తరంగా వెళ్ళే** పిల్లవేరులేమైనా చిటికెనవ్రేలి మందం దాటనివి, వుంటే దానిని విరిచి ఎండబెట్టి మూలమంత్రంతో తాయెత్తులో ధరించిన సమస్త దోషముల నుండి శత్రుపీడనుండి రక్షించును

ముఖ్యకార్యములకు బైలుదేరే సమయంలో అగరువత్తి ధూపంవేసి ఆ తాయెత్తును ధరించి వెళ్ళినట్లైన సర్వత్రా జయం కలుగును! ఇట్టి పూజచేసేవారు దీనిని రహస్యంగా వుంచాలి! అందరికీ ప్రకటిస్తే దాని ఫలము పోయి నిర్వీర్యమైపోవును కాబట్టి ఈ విధానము శ్రద్ధకల్గిన శిష్యులకూ పాఠకులకే ఉపదేశించబడుట జరిగినది!

## మూలికా గ్రహణ నక్షత్రములు

| నక్షత్రం | మూలికపేరు |
|---|---|
| అశ్విని | మోదుగ |
| రేవతి | మర్రి |
| మృగశిర | మేడి |
| అమావాస్య (ఆదివారం) | శ్వేతార్కం లేదా |
| పుష్యమి (ఆదివారం) | తెల్లజిల్లేడు |
| ఉత్తరాభాద్ర | గుంజ |
| ఆర్ద్ర | మారేడు |
| విశాఖ | మామిడి |
| పుబ్బ | దింతెన |
| పుష్యమి | ఉత్తరేణి |
| పుష్యమి | పునర్నవ |
| శ్రవణం | తులసి |
| శతతార | సర్వమూలికలకున్నూ ప్రశస్తము |

ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలయందు ఉత్తరదిక్కుకు పారిన ఉత్తరేణివేరు (అపామార్గం) ఉత్తరేణి సర్వప్రశస్తము — ప్రతీ మూలికతోనూ (అన్ని మూలికలలోనూ) కలిపి ఇవ్వవలయును

## i) స్కంద మంత్రం (కుమార తంత్ర ప్రోక్తం)

**అస్యశ్రీ** స్కందమహామంత్రరాజస్య । సదాశివ ఋషిః । **అనుష్టుప్** ఛందః । శ్రీ స్కందః పరమాత్మాదేవతా । ఓం బీజం । సాం శక్తిః । స్వాహా కీలకం । మమ స్కంద ప్రసాద సిధ్యర్థే జపే వినియోగః ।

| | | |
|---|---|---|
| ఓం సాం శం హ్రాం | - అంగుష్ఠాభ్యాం నమః | - హృదయాయ నమః |
| ఓం సీం రం హ్రీం | - తర్జనీభ్యాం నమః | - శిరసే స్వాహా |
| ఓం సూం వం హ్రూం | - మధ్యమాభ్యాం నమః | - శిఖాయై వౌషట్ |
| ఓం సైం ఐం హ్రైం | - అనామికాభ్యాం నమః | - కవచాయ హుం |
| ఓం సౌం భం హ్రౌం | - కనిష్ఠికాభ్యాం నమః | - నేత్రత్రయాయ వౌషట్ |
| ఓం సః వం హ్రః | - కరతల కరపృష్ఠాభ్యాం నమః | - అస్త్రాయ ఫట్ |

భూర్భువ స్సువ రోమితి దిగ్బంధః

## ధ్యానశ్లోకం :

షడ్వక్త్రం శిఖి వాహనం త్రినయనం చిత్రాంబరా లంకృతం
శక్తిం వజ్ర మసిం త్రిశూల మభయం ఖేటం ధనుశ్చక్రకం
పాశం కుక్కుట మంకుశం చ వరదం దోర్భిర్దధానం సదా
ధ్యాయే ద్దీప్సిత సిద్ధిదం శివసుతం స్కందం సురా రాధితం

## లమిత్యాది పంచపూజా (పంచోపచార పూజ సమర్పించాలి)

"ఓం సాం శరవణ భవ" — ఇతి మంత్రం జపేత్

## ii) స్కంద-ప్రాణమంత్రం

ఓం జగదుద్భవ మావహ । యజదుద్భవ మావహ
గుహ మావహ । దేవసేనాపతి మావహ

## iii) మంత్రగాయత్రి :

తత్పురుషాయ విద్మహే మహాసేనాయధీమహి
తన్నష్షణ్ముఖ ప్రచోదయాత్ ॥

### వేదమంత్రం

నమో అస్తు సర్పేభ్యో ఏకే చ పృథివీమను
ఏ అంతరిక్షే యే దివి తేభ్య స్సర్పేభ్యో నమః

## iv) పంచకోణ యంత్రం




### v) స్కంద జీవమంత్రం :

సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోగ్ం సుబ్రహ్మణ్యోం ॥ అని

## vi) స్కంద షట్కోణ యంత్రం



# స్కందతంత్రం

శ్లో॥ కుశాసన సమాసీనః కుశపాణీ ర్జితేంద్రియః
నిక్షిప్య కర్ణయోర్దర్భేణ్ణ్యద్వయం సుసమాహితః
ధృత్వా పీతాంబరం సమ్య గ్జపం కుర్యాద్యథా విధి
మనుం వై లక్ష సంఖ్యాకం జప్త్వా ధీమా నతంద్రితః
ఆజ్యాప్లుతైః కుశైశ్చైవ ద్దశాంశం కుశపుష్పకైః
వైశ్వానరం ప్రతిష్ఠాప్య హోమం కుర్యాన్మహేశ్వరి
తర్పయే ద్విధిపూర్వం తు సాధకస్తు కుశాంబునా
భోజయే ద్బ్రాహ్మణా న్విద్వాన్ శ్రోత్రియాన్ మంత్ర సిద్ధయే
నివేద్య శర్కలీ ర్భక్త్యా ప్రయోగా న్కారయే త్తతః

పై శ్లోకములకు అర్ధం ఇది

1) "దర్భలను అభిమంత్రించి తూర్పుముఖంగా వేసి, దానిపై పరచిన ఆసనముపై కూర్చుండి శుచిగా ప్రాణాయామంచేసి, దర్భలను అక్షతలను కుడిచేతిలో ధరించి, కుడిచెవికి పైగా దర్భలను ధరించి పీఠముపై కూర్చుండ వలెను

2) జపమునకు పచ్చని పీతాంబరము ధరించి ఉపదేశించిన విధముగా అంగన్యాస, కరన్యాస, ఆవాహనాది విధానముగా మన్యుసూక్తమంత్రము, సుబ్రహ్మణ్యమంత్రము కనీసం లక్షసార్లు జపించవలెను ఆపైన ఆవునేతితో దర్భలను తడిపి వాటితో మంత్రజపములో **దశాంశం** హోమంచేయాలి! దర్భలతో పుష్పములతో **దశాంశము** పూజించాలి

3) ఆపైన విధిప్రకారము అగ్నిప్రతిష్ఠాపనచేసి మూలమంత్రముతో హోమంచేయాలి! తిలలు ఆవునేతితో పాయసముతోగాని కలిపి దర్భలతో హోమంచేయాలి!'

4) ఇలా హోమతర్పణాదులు పూర్తిచేసాక విద్వాంసులూ, వేదపండితు లైన పవిత్ర బ్రాహ్మణులను ఆహ్వానించి, శ్రద్ధగా వారికి పరిచర్యలు పాద ప్రక్షాళనము జరిపి తృప్తిచెందునట్లు వారికి భోజనమిడవలెను

5) భోజనంతోపాటూ మధురమైన వంటకము, జంతికలు లేక చక్కిలమూ, మినపగారె లేదా వడ, నేయిఅన్నమూ కూరలతో కలిపి క్రమం ప్రకారం భోజనవడ్డన చేయాలి।

6) భోజనానంతరం బ్రాహ్మణులకు దక్షిణ తాంబూలములను సమర్పించి పాదనమస్కారములుచేసి వారి ఆశీర్వచనములు పొంది అక్షతలు వేయించుకొని బ్రాహ్మణాశీస్సులతో యిష్టదేవతాపూజ, పారాయణ, జపహోమ తర్పణాదులతో పవిత్రం చేయబడిన యంత్రాన్ని శుభముహూర్తమున తారాబలము శుభముగా ఉన్నరోజున ధరించాలి।

7) రక్షను ధరించునప్పుడు ప్రాణాయామముచేసి కుడిచేతియందు రక్షను ధరించాలి

## ఫలశృతి

మూకస్యా ద్వాక్పతి ర్దేవి రోగీ నీరోగతాం వ్రజేత్
పుత్రార్థీ పుత్రమాప్నోతి త్రిషు లోకేషు విశ్రుతం
వంధ్యా సూతే సత్పుత్రం గావశ్చ బహుదుగ్ధదాః
దురితం నచ తస్యాస్తి నాస్తి శోకః కధంచన

## vii) యంత్ర ధారణావిధి :

శుభనక్షత్ర యోగేచ కృత మారుత సత్క్రియః
కృత్వా సంపాతన విధిం ధారయే ద్దక్షిణే కరే

మోహన స్తంభనాకర్ష మారణోచ్చాటనాని చ
యంత్ర ధారణతో నూనం జాయంతే సాధకస్య తు
ఏత జ్జప్తం మహాభస్మ లలాటే యది ధారయేత్
తద్విలోకన ఏవస్యుః ప్రాణిన స్తస్య కింకరాః
ఏతజ్జప్తం పిబేత్తోయం మాసేన స్యాన్మహా కవిః
ఏతదుక్తం రహస్యంతే స్వసర్వస్వం వరాననే
నప్రకాశ్యం త్వయా దేవి యది సిద్ధిం త్వమిచ్ఛసి

ఇతి స్కంద తంత్రం

ఇది స్కంద తంత్రమున తెలుపబడిన యంత్రధారణా విధాన రహస్యము।

ఈవిధముగా యంత్రమును ధారణ చేసినయెడల సంతానములేని వారికి సత్పుత్ర సంతానము కలుగును — పై మంత్రార్ధము దీర్ఘరొగాలకు రోగనివారణ జరుగును

పాపము చెడుకర్మ నివారితమగును శత్రువినాశనమూ సర్వత్రా విజయమూ కల్గును ఎవరైనా దుష్టసంకల్పంతొ చెడుమంత్రములు ప్రయో గించితే అవి తిరగబడి వారికే తగులును



18

# స్కందోపనిషత్

## సుబ్రహ్మణ్య మంత్రము

అస్యశ్రీ సుబ్రహ్మణ్య మహామంత్రస్య ఈశ్వర ఋషిః అనుష్టుప్ ఛ్చందః శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతా శం భం జం రం శక్తిః వం కీలకం మమ సుపుత్ర సంతాన జనన సిధ్యర్థే (మృత వంధ్యాదోష పరిహారార్థే) । శ్రీసుబ్రహ్మణ్య మంత్ర జపే వినియోగః

## కరన్యాసం :

ఓం శం అంగుష్టాభ్యాం నమః - హృదయాయ నమః
ఓం రం తర్జనీభ్యాం నమః - శిరసే స్వాహాః
ఓం వం మధ్యమాభ్యాం నమః - శిఖాయై వౌషట్
ఓం ణం అనామికాభ్యాం నమః - కవచాయ హుం
ఓం భం కనిష్ఠికాభ్యాం నమః - నేత్రత్రయాభ్యాం వషట్
ఓం వం కరతల కరపృష్ఠాభ్యాం నమః - అస్త్రాయ ఫట్

## అంగన్యాసం :

ఓం శం హృదయాయ నమః

ఓం లం శిరసే స్వాహా

ఓం వం శిఖాయై వౌషట్

ఓం వం కవచాయ హుం

ఓం లం నేత్రత్రయాయ వౌషట్

ఓం శం అస్త్రాయ ఫట్

ఇతి భూర్భువ స్సువఃరోమితి దిగ్బంధః

## ధ్యానం :

అభీతి కటిహస్తాభ్యాం వజ్ర శక్తి ధరం పరం ।
శిఖి వాహన సంయుక్తం స్కంద మేకముఖం భజే

## లమిత్యాది పంచపూజ :

ఐం హ్రీం శ్రీం క్లీం ఓం సౌః శరవణ భవ స్వాహా

యంత్రము

| | | | |
|---|---|---|---|
| ఓం | సౌం | శ | ర |
| వ | ణ | భ | వ |
| శ | ర | వ | ణ |
| భ | వ | సౌం | ఓం |

## లమిత్యాది పంచపూజా :

ఓం లం పృథివీతత్వాత్మికాయై - గంధం సమర్పయామి
ఓం హం ఆకాశతత్వాత్మికాయై - పుష్పం సమర్పయామి
ఓం యం వాయుతత్వాత్మికాయై - ధూప మాఘ్రాపయామి
ఓం రం అగ్నితత్వాత్మికాయై - దీపం దర్శయామి
ఓం వం అమృతతత్వాత్మనే - అమృత మహానైవేద్యం సమర్పయామి
ఓం సం సర్వతత్వాత్మికాయై - సర్వోపచార పూజాం సమర్పయామి



i

# శ్రీ నీలకంఠ మంత్రము

అస్యశ్రీ నీలకంఠ మంత్రస్య బృహదారణ్యకఋషిః । అనుష్టుప్ ఛందః
ఆపదుద్ధారణో మహావటుక భైరవోదేవతా । హ్రాం వాం బీజం । హ్రీం వీం
శక్తిః । హ్రూం వూం కీలకం భూతప్రేత పిశాచాద్యుచ్చాటనార్థే
జపే వినియోగః

కరన్యాసం :

ఓం హ్రాం వాం — అంగుష్టాభ్యాం నమః
ఓం హ్రీం వీం — తర్జనీభ్యాం నమః
ఓం హ్రూం వూం — మధ్యమాభ్యాం నమః
ఓం హ్రైం వైం — అనామికాభ్యాం నమః
ఓం హ్రౌం వౌం - కనిష్టికాభ్యాం నమః
ఓం హ్రః వః — కరతల కరపృష్టాభ్యాం నమః

## అంగన్యాసము

ఓం హ్రాం వాం — జ్ఞానాయ హృదయాయ నమః
ఓం హ్రీం వీం - ఐశ్వర్యాయ శిరసేస్వాహా
ఓం హ్రూం వూం — శక్త్యై శిఖాయైవౌషట్
ఓం హ్రైం వైం — బలాయ కవచాయహుం
ఓం హ్రౌం వౌం — తేజసే నేత్రాభ్యాం వషట్
ఓం హ్రః వః — వీర్యాయ అస్త్రాయఫట్

భూర్భువస్సువరోమితి దిగ్బంధః

## ధ్యానం :

కరకలిత కపాలః కుండలీ దండపాణిః
తరుణ తిమిర నీలో వ్యాళ యజ్ఞోపవీతీ ।
క్రతుసమయ సపర్యా విఘ్న విచ్ఛేదహేతుః
జయతి వటుకనాథ సిద్ధిదస్సాధకానాం ॥

## మూలమంత్రము :

ఓం శ్రీం హ్రీం క్లీం క్ర్మ్యాం వటుకాయ
ఆపదుద్ధారణాయ కురు కురు వటుకాయ హ్రీం ॥

## జపసంఖ్య : లక్ష

మూడుసార్లు తేనెతో తడిపిన నువ్వులతో పదివేలు పురశ్చరణ హోమం



ii

# మృత్యుంజయ మంత్రము

(అపమృత్యు నివారణకు)

అస్యశ్రీ మృత్యుంజయ మహామంత్రస్య । కహోళక ఋషిః ।
దేవీగాయత్రీ ఛందః మృత్యుంజయరుద్రో దేవతా । జుం బీజం ।
సః శక్తిః । మృత్యుంజయేతి కీలకం । మమ అపమత్యు నివారణార్థే
సకల గ్రహదోష పరిహారార్థే జపే వినియోగః

కరన్యాసం :

ఓం సాం — అంగుష్ఠాభ్యాం నమః
ఓం సీం — తర్జనీభ్యాం నమః
ఓం సూం — మధ్యమాభ్యాం నమః
ఓం సైం — అనామికాభ్యాం నమః
ఓం సౌం — కనిష్ఠికాభ్యాం నమః
ఓం సః — కరతల కరపృష్ఠాభ్యాం నమః

